నీలికేక
కత్తి పద్మారావు
లోకాయత ప్రచురణలు : 65
ప్రధమ ముద్రణ, జూలై 1998
ప్రతులు · 2000

వెల 30 రూ

కవర్ పెయింటింగ్ } అక్బర్
లోపలి బొమ్మలు }

మేనేజర్ - కత్తి చార్వాకుడు

ఫోన్ 08643, 42840

ప్రతులకు

కత్తి స్వర్ణ కుమారి
లోకాయత ప్రచురణలు
లుంబినీవనం, పొన్నూరు-522 124, గుంటూరు జిల్లా ఎ పి

★ నవోదయ బుక్ హౌస్, కాచిగూడ x రోడ్స్ హైదరాబాద్
★ విశాలాంధ్ర బుక్ హౌస్, అన్ని బ్రాంచీలు,
★ నవయుగ బుక్‌స్టాల్ - సుల్తాన్ బజార్, హైదరాబాద్
★ మైత్రీ బుక్ స్టాల్ - మసీదు వీధి, విజయవాడ
★ ప్రగతి బుక్ హౌస్, మ్యూజియంరోడ్, విజయవాడ
★ నవోదయ బుక్‌స్టాల్, బ్రాడీపేట, గుంటూరు
★ మణి బుక్‌స్టాల్, సండే మార్కెట్, నెల్లూరు

లేజర్ టైప్ సెట్టింగ్ వి యస్ యస్ లేజర్ గ్రాఫిక్స్, లకిడికాపూల్, హైదరాబాద్
కవర్ ప్రింటింగ్ ప్రగతి ప్రింటర్స్, హైదరాబాద్
టెక్స్ట్ ప్రింటింగ్ · కళాజ్యోతి ప్రాసెస్, హైదరాబాద్

అంబేద్కర్ సిద్ధాంతగామి

విద్యావేత్త

పి.జె.ఆర్. శేఖర్ గారి అమ్మ

మహోన్నత వ్యక్తిత్వం గల దళిత తల్లి

పాలపర్తి కమల రత్నం గారికి

**అంకితం**

ఈ కవితా సృజనంలో నాకు దిక్సూచి సహచరిణి స్వర్ణకుమారికి, నా కవితకు ప్రేరణశక్తి కలేకూరి ప్రసాద్‌కు, వ్యాఖ్యాత సృజనకు

ఈ కవితలకు స్ఫూర్తినిధులు మద్దూరి నగేష్‌బాబు, పైడితెరేష్ బాబు, సతీష్‌చందర్, గౌరి, కోయికోటేశ్వరరావు, ఖాదర్‌మొహిద్దీన్, ఖాజా తదితర దళిత కవులకు

- నా నీలికేకకు సజీవశిల్పకారుడు అక్బర్‌కు
- ఈ కవితలను ప్రచురించిన తెలుగు దిన, వార, మాస, పత్రికల సాహితీ సంపాదకులు కల్లూరి భాస్కరం (ఆంధ్రప్రభ), ఉమామహేశ్వరరావు (ఆంధ్రజ్యోతి, ఆదివారం అనుబంధం), అఫ్సర్ (ఆంధ్రభూమి), కృష్ణారెడ్డి (ఆంధ్రజ్యోతి, సాహితీ వేదిక), రాఘవ, బాల (ఆంధ్రజ్యోతి వార పత్రిక) తదితర పాత్రికేయులు మిత్రులకు
- నీలికేక వెలుగు చూడటానికి ఆర్థిక సహాయం చేసిన సోదరులు పి జె ఆర్ శేఖర్ గారికి
- కవర్‌పేజీకి ఆర్థిక సహాయం చేసిన ఎన్ శాంసన్ గారికి
- నా పుస్తక ప్రచురణకు నిరంతరం సహకరిస్తున్న యం ఆర్ రాణాప్రతాప్, పి విజయకుమార్, విజయసింగ్ గార్లకు
- నా సాహితీసృజనానికి నిరంతరం ప్రోత్సాహకశక్తి సోదరుడు, ఆత్మీయుడు, దళిత రిసెర్చ్‌వింగ్ కన్వీనర్ కట్టా వినయ్‌కుమార్‌కు
- ప్రేమతో ఈ కవితా సంపుటిని తీసుకొచ్చిన లోకాయత ప్రచురణల మేనేజర్ చార్వాకుడుకు

## కృతజ్ఞతలు

# నీలికేక లోకి...

కవిత్వం అంటే కేవలం బావవీచిక కాదు ఉన్నదున్నట్టు చెప్పేదీ కాదు వాస్తవాంశం తాత్త్వికకొలిమిలో ఆయుదంగా ఆవిర్భవించి మనిషినీ, సమాజాన్నీ, యుద్ధోన్ముఖం చేసేది

కవిపురుటినొప్పుల్ని మోసుకొస్తాడు ప్రతిక్షణం పురుడు పోయగల ప్రకృతి తత్వాన్ని తల్లితనంలోని సజీవతే అతని కిచ్చింది కవిత్వమంటే బాషానువాదం కాదు జీవితానువాదమూ కాదు కవిత్వం సాంప్రదాయ జనితం కాదు అది మానవ సంస్కృతీ శిల్పం ఏ మానవ సమూహాల్లో ప్రకృతి సజీవంగా ప్రవహిస్తుంటుందో ఆ మానవ కంకాళం కూడా కావ్య చిత్రమే చీకటి గుహల్లో కొడిగట్టిన దీపాలను ఆకాశ నక్షత్రాలుగా వెలిగించ గలిగిన పునరుజ్జీవన కర్తే నిజమైన కవి

కవి దృశ్యంలో రంగరించబడి ఎప్పటికప్పడు నూత్న శిల్పంగా రూపొందు తుంటాడు మనిషిని పోరుడిగానో, బాధితుడిగానోకాక, వెలుగునీ, చీకటినీ ఆవహన చేసుకున్న తాత్త్వికుడిగా చూడగలుగుతాడు

కవి సందేశకుడు కాదు తాను నిర్మించిన పాత్రల నుంచే నిజానికి కవి సందేశం అందుకుంటాడు గొప్ప కవులందరూ తమని తాము కరిగించుకొని సజీవ పాత్రలకు ప్రాణం పోశారు తాను సృజించిన పాత్ర తల్లయితే తాను బిడ్డయ్యాడు పాత్ర బోదకుడయితే కవి ప్రబావితుడయ్యాడు పాత్రనాయకుడయితే తాను ఆయుధ మయ్యాడు పాత్ర తాత్త్వికుడయితే ఇతడు పృచ్ఛకుడయ్యాడు అందుకే కర్త కావడం కంటే సృష్టి కర్తకావడం కవి లక్షణం

నేను కవిత్వం చెప్పానని ఎవరన్నారు? నా చీలిన ఒంటిలో దాగున్న అంబుల పొదిలో ఆయుదాలే కాదు ఆకృతులూ ఉన్నాయ్ ఆయువులు వున్నాయి నేను నినాదం చేయడానికి గుంపుల గుంపుల సమాజం నాతో ఉంది అందుకే ఇక్కడ నినాదాలు చేయడం లేదు ఒక సంస్కృతినీ, ఒక చరిత్రనీ, ఒక సంఘర్షణనీ

ఒక ప్రేమధునిని, ఒక జీవన వ్యథనీ జీవితంలో రంగరించి కాటిలోని పిడికెడు బూడిదతో కన్నీటి బిందువులు కలిపి మట్టి చిత్రాలు గీస్తున్నాను

నేను సముద్రాలను, సింహాలను ఘోషింపజేసే, గర్జింపజేసే స్వరవేదిని కాను నాది నిశ్శబ్దం ప్రపంచాన్ని మీ ముందుకు మోసుకొచ్చినా, విశ్వాన్ని మీ ముందుకు తరలించినా మీ తలకు భారమవుద్దేమో అందుకే వాటిని నేనే ఆవహనం చేసుకొని ఆ స్ఫూర్తితో ఒక్క కేక

కేక కవిత్వమా? కేక వ్యక్తిదా ? కేక సమాజానిదా? కేకలో శబ్దాలున్నాయా? కేక చార్వాకుడిదయితే తాత్త్వికం కాదా ? బుద్ధుడిదయితే సామాజికంకాదా? సోక్రటీస్‌దయితే ప్రశ్న కాదా? స్పార్టకస్‌దయితే పోరాటం కాదా? వేమనదయితే గీతం కాదా? అంబేడ్కర్‌దయితే సమాజం కాదా? కేక జాషువాదయితే కవిత్వం కాదా? కేకకు వర్ణమెందుకు? రంగులన్నీ మాసిపోయినపుడు కవి ఆకాశాన్ని దించుకోక ఏం జేస్తాడు? విశ్వతత్వం అందులో లేదా? కేక లక్షణ మేమిటి? కవి స్రవిస్తున్నాడా? కవి కేక వేస్తున్నాడా? తరతరాల పాటకు అంతస్సూత్రంకోసం తల్లిగుండెల్ని తవ్వి పోయడం లేదుకదా? ఊరి బయటకి విసిరేసిన ఒక్క మాంసపు ముద్దలో ఇన్ని సజీవ సూత్రాలా? ఇన్ని సముద్ర ఘోషలా? ఇంత తత్వమా? ఇన్ని మానసిక నిదులా? కేక అంటే చంపినపుడో చీరినపుడో అరిసే అరుపనుకున్నామే విననట్టు ఉంటే ఒక్క క్షణంలో కేక ముగుస్తుందనుకున్నామే ఆకాశం గుండెల్లో గుచ్చిన ఆ చూపుడు వేలు లక్ష ధర్మసూత్రాలను ప్రశ్నార్థకంచేసిందా? ఆ వేలును గీయటానికి భారతంలో పుట్టిన ఏ కుంచకీ వర్ణంలేదా? మీరేమన్నా అనుకోండి నా కేక తరతరాల పాట ఇది అలకాదు ధోరణికాదు ఒక దశాబ్దంలో ముగిసిపోయేది కాదు ఇది శతాబ్దాల చీకటిపాట విశ్వంలో చీకటి నిడివెంతో నా పాట జీవితమంత నేను మా అమ్మ పాటను వింటూనే వున్నాను అది వింటే ఆ దృశ్యం మీరెటూ చూస్తారు ఆ తత్వం మీరెటూ ఆలకిస్తారు? ఆ పునర్నిర్మాణానికి మీరెటూ ముందుకొస్తారు అందుకు ప్రేరణ నేనయితే ఆ తల్లికి బిడ్డనే తరతరాల చీకటి పాటకు అంతరంగాన్నే

**నేనూ... మీతోపాటు 'నీలికేక' లోకి.....**

15-7-1998
లుంబినివనం
పొన్నూరు-522 124

- కత్తి పద్మారావు

## ఇందులో.......


| | | పేజి |
|---|---|---|
| 1) | శబ్ద ప్రమాణం | 1 |
| 2) | ఒక్కమాటకోసం | 4 |
| 3) | పురిటివాన | 5 |
| 4) | తొలకరి నవ్వు | 8 |
| 5) | మనిషి నుండి మనిషి | 11 |
| 6) | ఇక నీవు నిర్ణయించుకో | 13 |
| 7) | యుద్ధమా | 16 |
| 8) | నీతో కాదు నాతో | 18 |
| 9) | నిశ్శబ్దంలో | 20 |
| 10) | ఆయుధమా? అవతారమా? | 22 |
| 11) | వెన్నెలమ్మ | 24 |
| 12) | మళ్ళీ పుడుతున్నాను | 26 |
| 13) | యుద్ధం కోడై కూసింది | 28 |
| 14) | శాంటి కాపీ | 29 |
| 15) | చూపుడు వేలు | 30 |
| 16) | ఒక్కడుగు ముందుకు | 32 |
| 17) | పురుడు | 34 |
| 18) | నగరాన్ని దాటుతున్నాను | 35 |
| 19) | అస్మిత | 36 |
| 20) | కొంప | 37 |
| 21) | తెప్ప | 38 |

| | | |
|---|---|---|
| 22) | కుదిబడ్డ ఆకాశం | 39 |
| 23) | ఇకనైనా జీవించండి . ! | 41 |
| 24) | నెత్తుటి నచ్చత్రం | 43 |
| 25) | ఎఫ్ ఐ ఆర్ | 44 |
| 26) | తల్లి | 46 |
| 27) | దొరికిందంతా | 47 |
| 28) | తోలు తిత్తి | 48 |
| 29) | శవం తెప్ప | 50 |
| 30) | నా సంఖ్య ఒక్కటే | 51 |
| 31) | చారిక | 52 |
| 32) | గుండె దీపం | 53 |
| 33) | నేను చూశా | 54 |
| 34) | ప్రేమ లేఖ | 55 |
| 35) | నగరంలో నడవొద్దు | 58 |
| 36) | నీలికేక | 60 |
| 37) | మళ్ళీ ఈత | 61 |
| 38) | నిప్పు కవిత | 62 |
| 39) | బ్లాక్ డే | 64 |
| 40) | నిరుడు | 65 |
| 41) | తాడిసిరేసిరా | 66 |
| 42) | నేను ఆమ్రపాలిని | 69 |
| 43) | చీకటి లాంతరు | 71 |
| 44) | నల్ల సముద్రం | 72 |

| | | |
|---|---|---|
| 45) | తంబుర పాట | 73 |
| 46) | నేను | 75 |
| 47) | గుండె పూలు | 77 |
| 48) | నాణెం చెప్పిన కథ | 78 |
| 49) | సంధ్య | 79 |
| 50) | సముద్రం మీద నడిచి పోతూ | 82 |
| 51) | మట్టి కూడా నిప్పు కణికే | 84 |
| 52) | వర్ధాంతరం | 85 |
| 53) | అందుకే నేను అగ్గి పూలు పూసేది | 87 |
| 54) | చినుకు కాటు | 89 |
| 55) | బొమిక చెప్పిన కథ | 91 |
| 56) | ఊదుతునే ఉండు | 93 |
| 57) | నేను అడవిని ఆహ్వానిస్తున్నాను | 93 |
| 58) | ప్రవాహం | 97 |
| 59) | భూమిని మింగిన తల | 98 |
| 60) | అస్తమయాన్ని కాలదన్నాను | 100 |
| 61) | రూళ్ళ కర్రంత నీడ | 102 |
| 62) | నిప్పుగా | 105 |
| 63) | జై కిసాన్ | 106 |
| 64) | శిశువు ఎదురైనపుడు | 108 |
| 65) | అగ్గి నౌక | 111 |
| 66) | కిరీటం | 113 |
| 67) | చూపు | 114 |
| 68) | నేనూ నీతోవుంటా | 116 |




## శబ్ద ప్రమాణం

భాష నాలుకది కాదు

కనురెప్పలది

గొంతు మూగవోయినపుడే

కళ్ళు కావ్యాలు గీసేది

రెప్పపైని ముంగురులన్నీ

ప్రశ్నల గుంపులే

మాటలు శబ్దాలైతే

అర్థాల ఆయుష్షు కుంగదూ!

భాష కనుల్లోనేగా

సెలయేరయ్యేది

ప్రకృతికి నోరు లేకపోవడమే వరం

యేరు ధ్వనిస్తున్న సంగీతానికి

సాటిరాగల గొంతేది ?

అవునూ !

ప్రపంచ యుద్ధాలు చేసిన

బూట్ల చప్పుళ్ళన్నీ ఇపుడేవి?

అనంత నిశ్శబ్దం తరువాత

రెండు మాటలు చెప్పి కన్నుమూసిన

బుద్ధుణ్ణి శతాబ్దాలన్నీ చూడటంలా!

భాషనెందుకు మీరు

సుప్రభాతం చేసి రోళ్ళు నయమనిపిస్తారు

ఒక్క మాట మాట్లాడకుండా

పాలన్నీ ఇస్తున్న తల్లి

పద్మాసనంలోని యోగనిష్టకన్నా,

మీ మంత్రోచ్చారణ గొప్పదా ?

కరుణ ఏవ ఏకోరసః

మునివేళ్ళలోని మెత్తదనం

రక్తాన్ని చూసినపుడు కూడా గట్టి పడటం లేదు

కత్తి దించిన తరువాతేగా

అశోకుడు ఆకాశమంతా పరచుకొంది

పంటచేను నిశ్శబ్దంగా పెరిగాక

నూర్పిడిలోనేగా కేకలు, బొబ్బలు?

మీరు కవాతుల మధ్య

ప్రమాణాలు చేస్తూ ఉండండి

మేము నిశ్శబ్దంగా వింటూ వుంటాము

ఇంద్రుడి వజ్రాయుధం దగ్గర నుండి

కరసేవలో 'రామ' శబ్దం దాక మేము ఎన్ని శబ్దాలు వినలేదు

మాకు ఒకే ఒక నమ్మకముంది

మీ ప్రమాణాల శబ్దాలకందనంత దూరంలో

కట్టెల మోపుని దించి

కొండ చరియల్లో నీళ్ళు కళ్ళకద్దుకొన్న

గోండుస్త్రీ చూపులోని నిశ్శబ్దానిదే

అంతిమ ప్రమాణమని

ప్రమాణమంటే కూల్చడానికి చేసే ధ్వనికాదు

పునర్నిర్మాణానికి చేసే లాంగ్ మార్చ్

*19-3-98*



# ఒక్కమాట కోసం

ఆ శిరస్సు అక్షరాలన్నీ రాల్చేసింది
రాలిన ప్రతి అక్షరం బూడిదలో కలసిపోయింది
ఆకురాలి మర్లా పూత లేకుండా
ఆ చెట్టు మోడుబారింది
ఆ నాలుక అన్నీ ధ్వనులే చేసింది
ఒక అర్థవంతమైన శబ్దాన్ని కూడా అది పలకలేదు
దాని చలనం ఆగిపోయాక
మాంసపు కండలా అది మిగిలిపోయింది
ఆ పూలదండలన్నీ వాడిపోయాయి
ఆ మిగిలిన దారం ఓటమికి గుర్తుగా వేలాడుతోంది
ఆ పిడికెడు బూడిదపై కట్టిన స్మారక చిహ్నం మీద
ఒక్క కన్నీటి బిందువు రాలలేదు
అదిగో
ఆ తల్లి సమాధి మీద
గుప్పెడు పూలతో ఒక్క కన్నీటి బిందువు
ఆ అమ్మ చెప్పిన మాట ఒక్కటే
నాయనా నిశ్శబ్దం
నీవు తప్పక మరణిస్తావు
కాని మరణించని ఒక్క మాట కోసం జీవించు
ఆ మాటతో నీవు మరణాన్ని జయిస్తావు



# పురిటి వాన

ఇంటి మూలల్లో
పగటి చీకట్లో
నా పొత్తిళ్ళలో
పసికందు మూలుగు
నన్ను సుడిపెడుతుందే
అమ్మా !

కాలం కాని కాలంలో
ఏందే ఈ వాన
ఆకాశమంతా
గుండెల్లేని నల్లకొండల్లా
బద్దలవుతోంది

ఆయువు పోతున్న దీపం బుడ్డి,
పసిబిడ్డ అరమూసిన కనుల్లోని
వణుకుబాస కొసరి కొసరి
నా ప్రాణం గుంజుతుందే

ఆకు సందుల్లో
నీటి ధార
గుడిసె రొమ్ముల్లో
పాలుగులేస్తుంటే
మునేళ్ళు కందేటట్టు
నువ్వు అలికిన
ఇసినగర్ర అలుకంతా
చిత్తడి చిత్తడి
అయ్యిందే...

అమ్మా ! నువ్వు
మూడు రోజులనాడు
కట్టుకున్న పాచార
ఇడవకనే పోతివి
నీలాడిన కాడ నుండి
నీ కరవ చాకిరేకదే

ఏటికొకళ్ళం
పురుడుకొచ్చి
బానలో కొసరు గింజలతోసహా
గుంజుకెళుతుంటే
ఇల్లు కప్పుకోవడం
నీవల్లకాక పోతున్నే ?

కుడుముల కుండలో
చెత్తలాగా నీవు
రాను రాను ఉడిగిపోతున్నావు

నీ మాడుకు
రుద్దాల్సిన ఆముదపు బొట్టు
నా బిడ్డకు ఉగ్గు పోత్తుంటివి
కోంటింటికాడ
బియ్యం పోసి తెచ్చిన
దనియాల రసంతో
నన్ను వెచ్చచేస్తివి
పాణం పొయ్యటమేగాని
పాణం నిలబెట్టుకోవడం
తెలియదేమే!

కనుమూయని ముసురులో
నాన్న ఓదెలు గడతానికెళ్ళె
తడిసి ముద్దయి వచ్చినోడికి
పొడి పంచలేదాయె

అమ్మా!
ఎన్ని కట్టాలొచ్చిన
తరగని నీ నవ్వు ముఖంలోని
కన్నీటి దీపాల్తో
నన్ను వెలిగించవే!
నేనూ నీలాగే కాలాన్ని జయిస్తా



# తొలకరి నవ్వు

నవమాసాలు పేగుల్ని చుట్టుకొన్న
పసికందు పొత్తిళ్ళలో కెవ్వుమన్నపుడు
నెత్తురంతా కూడగట్టుకుని
తెల్లని పెదాలమీద
ఒక నవ్వు పువ్వు

మండుటెండల్లో
కొత్త కుండలో ఆమడ దూరాన్నుండి
తెచ్చిన తియ్యనీరు
తలదించి
దోసిటితో మొకానచల్లుకొన్నపుడు

ముత్యాలు పొదిగిన
ముఖాన్నుండి ఒక నువ్వు పువ్వు

మగ్గం గుంటలో
కళ్ళూ కాళ్ళు చేతులూ
ఆరుగాలం ఆడించి
పోగు పోగు అతికి
పచ్చందించి
అరచేతిలో శ్రమఫలం పడ్డపుడు
వేళ్ళ కొసల్లో పూసిన నవ్వు పువ్వు

పడమటి కాలువకెళ్ళి
ఈల పాటతో
గుడ్డలుతికి
వంటిమీద ఎండిన
పవిటతో గడపలోకి రాగానే
ఈడొచ్చింది అమ్మాయికి అన్న
మాట చెవిలో పడ్డపుడు
కళ్ళలో పూసిన ఒక నవ్వు పువ్వు

మాపటేల చిర్రెండలో
పడమటి గట్టుకెళ్ళి
పచ్చి గడ్డిమోపు
మిండల భారంగా తెచ్చి
ఇంటి పడ్డకు మేపి
పాలుపిండి
బుడ్డోడికి పచ్చిపాల నురుగు నాకిచ్చినపుడు
అయమ్మ కనురెప్పల్లో పూసిన నవ్వు పువ్వు

బడింటికాడ
గనిసిగడ్డల బండి దిగిందని
ఎడగారోడు గోలపెడితే
బానలో నూకలు చెంగునగట్టి
బేరమాడి బేరమాడి
ఈసెడు కొని
కొసరుగడ్డ మునిపంట కొరికి
పిల్లోడికి నోటికందించినపుడు
పళ్ళ కొసల్లో
పూసిందొక నవ్వు పువ్వు

మట్టల పండక్కి
ఈత మట్టలు తెచ్చి
రంగు రంగుల పూలు
ఈనెల్లో గుచ్చి
పచ్చనాకు రంగులో
పరికిణీలు కట్టి
పాటలు పాడుతూ
వాడ పిల్లలంతా
వీధి కొచ్చినపుడు
వాకిట్లోకొచ్చి ఊరేగింపుతో
నాగులేరు జూసిన
ఆ తల్లి కనుకొలకుల్లో నవ్వు పువ్వు

నవ్వులో సగం ఆకలితీరు
నవ్వుతో కన్నీరు కరుగు
నవ్వు మా వాడకు పెళ్ళిపందిరి
నవ్వే మా వాడకు తొలకరిజల్లు



# మనిషి నుండి మనిషికి

దూరం ఒక గమ్యం

మస్తిష్కం ఒక తర్కం

నేను శిల్పాన్ని చూస్తున్నా

చెవి దాని శబ్దాన్ని వెతుకుతోంది

నేను పాట వింటున్నా

కనులు దాని రూపాన్ని గీస్తున్నాయి

వివేచన హృదయాన్ని

హృదయం వివేచనని
జయించాలని ఆరాటం
ఎర్రనిదంతా రక్తం కానట్లే
తెల్లనిదంతా వెన్నెలా కాదు
చిత్రాన్ని రంగులతో రుద్దేకాలం పోయింది
గీతల్లో భూగోళమే కాదు
మానవ కంకాళం కూడా వుంది
లూయీస్ శిధిల కోటపై
వాల్టేరు చితాభస్మ పతాకం
అడవి కుటీరంలోనేగా
రూసో సామాజిక ఒప్పందం
మీరు తరిమి కొట్టండి
లేదా భూమికి కంచె నాటండి
వాళ్ళు హద్దుల్ని చెరిపేస్తారు
కలం నుండి రాలిన ఒక్క సిరా చుక్క
తాను పుట్టిన వర్ణాన్ని జయించి
విశ్వగీతం సృజించడంలా
నీవు నాకు ఇనుపగోడలు కట్టినా
నా ప్రారంభం మనిషి
నా ముగింపు మనిషి



## ఇక నీవు నిర్ణయించుకో....

ఒక బంధాన్ని రక్షించడానికి

ఇన్ని నిర్బంధాలా?

ఏకత్వం

వైరుధ్యమా? వైవిధ్యమా?

నేను నడుస్తున్న కొద్దీ

దూరం రెట్టింపవడానికి కారణం

దూరం పరుగుకున్నంత వేగం
నాకు లేదా?
నేను ఎందుకు పరుగెత్తుతున్నాను
విశ్రాంతి కోసమా?
విశ్రాంతికి కావలసింది
ప్రదేశమా? దేశమా?
తోటలు పూలు ఆకాశం
నా పరుగుకు శ్రుతి చేస్తున్నాయి తప్ప
నాకు విశ్రాంతినివ్వడం లేదే?
నేను ఎవరి హస్తం కోసమో
తారాడుతున్నాను
నేను పట్టుకొన్న ప్రతి చేయీ
తునిగి పోతూనే వుంది
నేను మరణ వార్తలు వినలేకున్నాను
అంతమాత్రాన ప్రతిక్షణం కనడానికి
కూడా సిద్ధంగా లేను
కనడం నాకు వరమని ఎవరన్నారు?
మీ కాళ్ళకు సత్తువ వచ్చినాక కూడా
నా గుండెల మీద తన్నుతూనే వుండండి
నా ఆనందాన్ని గురించి
మీ చప్పట్లు వినబడుతూనే వున్నాయి
పుట్టిన వాడు "మీ ఇచ్ఛకు నేను ప్రతిఫలమా?
మీ ప్రేమకు నేను రూపాన్నా?" అని నిలదీస్తున్నాడు

అందుకే
నా కర్తృత్వం కోసమే
నా నడక
శరీరానికి స్పృహలేదని ఎవరన్నారు?
శరీరం విద్యుత్తయినపుడల్లా
సంతాన ప్రతిఫలనాన్ని నేను కోరుకోవడం లేదు
ఈ సృష్టిని ముందుకు నడిపించే
పెనుభారం నాకెందుకు?
నన్ను గతాన్ని నెమరువేసుకోమని
మీ ఆంక్షలు ఏమిటి?
నా కన్నీరంతా వరదలై పారితేనే కాని
మీకు బతుకులేదా?
వర్తమానం అంతా కుండపోతగా కురుస్తుంటే,
నేను ముందుకు ఎలా చూసేది?
నేను కాలాన్ని, ప్రదేశాన్ని
జయిస్తున్నాను

నేను నా కోసం నడుస్తున్నాను
ఇక దూరం నాకెదురొస్తుంది
నిన్ను కనడం నీలో కరిగిపోవడం కాదు
ఇక నన్ను నేనే
నాలో నేనే నాతో నేనే
ఇక నీవు నిర్ణయించుకో
నాతో నీ వేంటో



## యుద్ధమా!

లోయల్లో చీకటి నదీ ప్రవాహం
ఆకాశం తలుపులు తెరిచింది
దారుల సుడిగుండంలో
ముక్కు మూసుకోకుండానే మునకలు
ప్రవాహం ఆయువులు పీలుస్తున్నా
ఏవో పాదాల కోసం వెదుకులాట
ఎన్నిసార్లు స్పృహ తప్పినా
ప్రాణం మాత్రం తలుపులు తడుతూనే వుంది

చిన్న కాంతిరేఖ కోసం
ముళ్ళ పొదల్లో ఈత
కాళ్ళు ద్రవించిన కొద్దీ
జారుతున్న మెట్లు
మేఘం తుంపులు తుంపులుగా
ఆకుల సందుల్లో !
ఆ పర్వతం గుండెను కోసిన నది
అలలతో కడుతున్న కట్లు !
ఆ రెండు మునివేళ్ళు ఎన్ని దీపాలనైనా
వెలిగించగలవు
నెర్రెలు నెర్రెలుగా పగిలిన భూమిని
ఒక్క నీటి బిందువు కలిపి ముద్ద చేయడంలా
గడపలు ద్వారాలు లేని
గుహలో వెలుగుతున్న ఆ దీపం మాత్రం
పెనుగాలికి ఆరిపోవడం లేదు
అన్ని కొలుములు ఆరిపోయాయి
అదిగో
ఆ గుండెకొలిమి ఒక్కటే ఆహ్వానిస్తుంది
నేను దానిలో పదును తేలేలోపు
మీరు సమ్మెట దెబ్బలు ఆపకండి
యుద్ధమా !
నీ కౌగిట్లో జీవించనీయ్
మనిషికీ మనిషికీ అడ్డువస్తున్న
ప్రతిదాన్ని జయిస్తూ పోనీ
మనిషిని గెలుచుకోవాలంటే
నేను ఓడిపోవాలా !
అయితే నేను ఓటమిని అంగీకరిస్తాను
సరేలే కానియ్!

# నీతో కాదు నాతో

చాలా దూరం నడిచాకగాని
నేను నా వైపుకి తిరగలేదు
రెండు మూర్తిత్వాలు నాలో
నన్ను మరింత లోతుకు

సమరమంటే
అంతః ప్రకృతులదా?
చలనమంటే పునర్వీక్షణలోని
వైరుధ్యమా?
యుద్ధమంటే ఇద్దరు వ్యక్తుల మధ్య
రెండు సైన్యాల మధ్యసాగేదనుకొన్నాను
తనతో తాను చేసేదే అసలు సమరమా?
ఈ సమరానికి ఆయుధాలు లేవా?
అంతరంగం దొరకదా?
నెత్తురు ధారలై పారదా?
ఈ యుద్ధానికి
చేతులు దృఢమైనవైతే చాలదా!
నన్ను నేను ఎందుకు చీల్చుకోవాలి?
సముద్రాలు, కొండలు లోయలు
నేను నాలో ఎందుకు చూసుకోవాలి
ప్రపంచమంతా తిరిగి వీటిని
నేను  చూడడం లేదా?
అయినా నేను ఒంటరినే అనే ఈ ఒక్క
ప్రశ్నను చంపితే చాలదూ!
నాలో ప్రేమవుందని నేను
వాదిస్తున్నాను కదా! శూన్యం కూడా వుందని
ఎందుకు చెప్పాలి ?
నేను శాంతికి గుర్తుగా
తెల్ల వస్త్రాలు ధరిస్తున్నాను
నాలో భూమి దాగుందని



నా కను గుడ్డులోని నలుపు ప్రకటిస్తుంటే
దాని నోరుమూస్తే నేను అంధురాలినా
నేను
నావైపు చూడనంత కాలం
వీళ్ళంతా నా బానిసలుగా లేరూ !
ఒక్కసారి నేను వెనక్కి తిరిగేసరికి
నా మీద ఇన్ని ప్రశ్నలు వేస్తారా !
ఇన్ని గొంతులు విప్పుతారా?
గోడలు బయటలేవు నీలోనే వున్నాయని
బుకాయిస్తారా!
మీకంటే సమాజం మంచిదనుకుంటా
అది నన్ను కీర్తిస్తుంది నా సమాధిలో నన్ను
నిశ్శబ్దంగా వుంచి పూజలు చేస్తుంది
నేను నాలో వందగోరీలు కడితే మాత్రమేమిటి?
నా చెవుల నిండా ఢమరుకధ్వనులు
నేనిపుడెటు నడవాలి
నీవేపా నావేపా
అయినా ముందుకు నడచిన
అలెగ్జాండర్, హిట్లర్ కంటే
తమలోకి నడచిన
బుద్ధుడు కపిలుడు
ఎక్కువ దూరం నడవలేదా?
ముందు నన్ను మనిషిగా బ్రతకనివ్వండి
ప్రకృతిలో ప్రకృతిగా మననివ్వండి
నేను ఎన్నో బొమ్మలు గీసిన చిత్రలేఖిని
ఎన్నో శిల్పాలు చేసిన శిల్పవేదిని
నా చిత్రాన్ని గీయడానికి
కుంచె రంగులో ముంచాను
అప్పుడు తెలిసింది
రంగులకందని నా చిత్రం
ఒక యుద్ధగీతమని
అది నీతో కాదు నాతో



# నిశ్శబ్దంలో....

వీక్షణంలో నిశ్శబ్దం
గుండెకొట్టుకోవడం వినబడకుండా
కళ్ళు బిగబట్టి చూస్తున్నాయి
భావం వ్యక్తికీ అభివ్యక్తికీ మధ్య
తెగిన తీగలా వేలాడుతోంది
చెట్టు పూగినంత పరిమళంగా
చీకటున్నంత స్పష్టంగా
కంటిలో ఇంకిన నీటి బిందువు ఒక్కటే

మాట్లాడుతోంది
మేఘం అంతతేలిగ్గా పరిగెడుతూనే
భూమిని బద్దలు చేస్తుంది
అద్దం అంతస్పష్టంగా కనిపిస్తూనే
గుండెను తవ్విపోస్తుంది
నిండి పోయిన కుండ
ఖాళీ కుండకు దోసిలొగ్గింది
సముద్రం ఒడ్డున నిలబడ్డ శరీరం
గాలిలో తేమ లేదని ప్రకటిస్తుంది
మాటలన్నీ ఇసుక పర్రలై
దుమ్మురేగుతుంటే
కనురెప్పల్లో రేగుతున్న ఉప్పెనలో
కృతులు సజీవమవుతున్నాయి
మీరు
కురిసిన నీటి బిందువులను
లెక్కకడుతూ
కురవని నల్ల మబ్బులన్నీ తెల్లబడే దాకా
సముద్రాన్ని ఎండబెట్టండి
ఆ తరువాత
ఒక్క నీటి బిందువు కోసం
మీరు భూమంతా తవ్వి పోద్దురు గాని
బాబూ !
ఆ నిశ్శబ్దానన్నా బతకనివ్వండి
మీ వికటాట్టహాసాన్ని ముగించేశక్తి దానికే వుంది
అగ్గి నింపుకొన్న కన్నీటి బిందువొక్కటి చాలదూ
మళ్ళీ పునః సృష్టి చేయడానికి

*3-3-98*



## ఆయుధమా? అవతారమా?

నిర్బంధ వేదాలు

పాప్ మ్యూజిక్‌లో వినిపిస్తున్నాయి

కాలం దేశం శబ్దంలో

మార్పులేకాని సంకెళ్ళు ఒక్కటే

దేశం స్వర్ణయుగమైనపుడల్లా

మిగిలేది బూడిదేగా

సామ్రాజ్యమంటే అంతమయ్యేదని

అర్థమేగా

అణువు పేలితే ఏమి
ఆత్మమిగలదూ?
అవతారాలన్నీ ఆయుధాలేగా
వజ్రాయుధమంటే ఇంద్రుడు
సుదర్శనమంటే కృష్ణుడు
పరశురాముని గండ్రగొడ్డలి
రాముడి బాణం
ప్రజల రక్తపు నైవేద్యం
అవతారం నిర్మించడానికేగా
రాజస్థాన్‌లో రాజసూయం
వాజ్‌పేయం, సతి
భారతమంతా ఎడారయితే
అణు ఇంధనశక్తి మరింతకాదూ
అయినా!
ఆదిశేషువంటే విష్ణువుని
మొయ్యడానికి కాని మింగాడానికా?
మీరు సుస్థిరమన్నపుడే
ఇది నిలబడి కాలే కాష్ఠమని
వల్లకాడులో పుర్రె చెప్పింది
ఇది నాది అని గట్టిగా
అరిచాడా
అది దొంగిలించబడిందే అని
తెలుసుకో !
మానవత్వాన్ని పండించడానికి
ఒక యుగం
యుగాంతాన్ని చేయడం ఒక క్షణం



# వెన్నెలమ్మ

మా చెల్లెమ్మ జెడలోని
మల్లెల్లాగా
ఆకాశంలో నక్షత్రాలు పూశాయి
మా చెల్లెమ్మ కన్నుల్లో
పొడిచిన చంద్రుడు
ఆమె నవ్వుల్లోని
వెన్నెలై కురుస్తున్నాడు

అమ్మా! చెల్లెమ్మా!
నీ గజ్జెల పట్టాల గలగలల నుండి
మన ఊరి చెరువులో
ముత్యాలు మొలిచాయి
ఉయ్యాల పండక్కి
నీ కాళ్ల గోరింటాకుతో
మన పల్లె ఊడలమర్రికి
మంకెనలు పూశాయి గదమ్మా!

చెల్లీ! నాకు చలిజరమొచ్చి
వణికి పోతున్నప్పుడు
నీ కొత్త వోణీ కప్పి
నా కళ్ళు తడిపావు గదే !

తల్లీ! నా బొక్కల కోసం
నీ దిద్దులు పెట్టి
"అన్నా! నువ్వన్నా చదువుకోరా
మన కష్టాలు తీరతాయి" అన్నపుడు
నా గుండె చెరువయింది గదమ్మా!

జెండా పండక్కి నువ్వు
సిల్కులంగా కట్టి ఊరేగింపుకెళితే
అంబోతు కళ్ళల్లో
కారం బడింది గదరా !

అమ్మా!
నువ్వు ఊరు మేసిన వెన్నెలవుతావనుకుంటే
నేను అక్షరాన్ని వొదిలి
ఆయుధాన్ని అయ్యేవాణ్ణి గదే !



## మళ్ళీ పుడుతున్నాను

ఎవరు వీరు
భూమి పొరల్లో
అగ్నిధారల్ని
పుడిసిస్తున్నారు

ఎవరు వీరు
ఆకాశం నిచ్చెన మీద
గ్రహాల పూలు కోసుకొస్తున్నారు

ఎవరు వీరు
సముద్రగర్భంలోని
దావానలంలో
తానమాడుతున్నారు

ఎవరు వీరు

చీకటిని వెలిగించి

రుధిర సంగీతం

ఆలపిస్తున్నారు

ఎవరు వీరు

కాటిలో పుర్రెల

జీవగాధల్ని

గుంపు పాటల్లో

రుతిస్తున్నారు

వీరి కేక

ప్రసవంలో

తల్లికేక

వీరి పాట

శిశువు జననంలోని

తల్లిపాట

అందుకే

నేను మళ్ళీ మళ్ళీ

ఆ పాటలో

పుడుతున్నాను

# యుద్ధం కోడై కూసింది



ఎందుకో కొన్ని నరాలు
పాట మధ్యలో తెగుతున్నాయి
ఎందుకో! కొన్ని గొంతుల
జీవ ధాతువులు
నవ్య లోకానికి ప్రవిస్తున్నాయి

ఎందుకో కొన్ని రూపాలు
గుండె గెండెకి
జనిస్తున్నాయి

ఎవరో మర్లా మర్లా
బ్రతికి నన్ను తట్టి లేపుతున్నారు

ఎవరో నా కనుగుడ్లలో
కాంతి కిరణంగా పుట్టి
నా నిద్రను చంపుతున్నారు

ఎందుకో ఆ అంబేద్కర్
మట్టినంతా తన శిల్పంగా
మల్చుకొంటున్నాడు
ఇక యుద్ధం
కోడై కూస్తుంది
చావు ఓడిందని

*29-12-96*

# శౌంటి కాఫీ

గుడ్డ గుంజబోయి కళ్ళు తిరిగి
కాలవలో ముందుకు పడ్డా

ఈడు బువ్వెట్టక
కోంటోళ్ళ కొట్లో
రెండిడ్డెన్లు తిని
మాటేలదాకా పస్తుంటే
ఈడి పెళ్ళాం
నానా మాటలని
సద్దికూడు పోసింది

శౌంటికాపీ తాగుదామని
కొంగులో రూపాయి కట్టుకుంటే
మనవడి బిళ్ళంగోడు ఆట
ఊడదీసుకెళ్ళింది



ఏందో! మావూళ్ళో
మంచం దిగకుండా గార్లు బూర్లుతిన్న
గౌరమ్మ గుటుక్కున చచ్చింది
నాకాచావన్నా రాదాయె

నువ్వు చస్తే
వల్లకాడులో చోటెక్కడుందే
ఆ ఈరాసామి
ఆడిపాలాన్ని
మన సోశానం సగంత్రానికి జరిపాడె అని
మా ఈరిగాడు అన్నాడు

నీ కారుడిక్కీలో శవం ఉందని
నేను మురుక్కాలవ దేవి
నీకు సీసాపెంకులమ్మితే
కోసుకుపోయిన నా చేతిలో
నువ్వు సత్తురూపాయి విసిరావే!
ఆనాడే అనుకున్నా
నీ చిత్తు గోతాల్లో జేబుకత్తెరుందని

నీ బూటుకాలిని నా ఒడిలో పెట్టుకుని
రుద్దిరుద్ది అద్దాన్ని చేస్తే
చెల్లని కాగితాన్ని నా మొకాన కొట్టావే!
అప్పుడే అనుకున్నా
నీ బూటు మడమలో
భారతమ్మ తలుందని

నిన్న టీవీలో నిన్ను గుర్తుపట్టా
పార్లమెంటు ముందున్న అంబేద్కర్ చూపుడువేలు
నీ గుండెల్లో దిగబడిందని తెలుసుకున్నా
ఇప్పుడు నాకర్థమైందిరా
బాబాసాహెబ్ మూసిన నాలుగువేళ్లేందో

*10-10-96*



## ఒక్కడుగు ముందుకు .....

నేను
ఏ చూపు కోసం
గడపదాటి పరుగు తీశానో

ఏ గుండె సవ్వడి కోసం
రేయింబవలు
ఆరాటపడ్డానో

ఏ అడుగుల చప్పుడు కోసం
నిరంతరం పారాడానో
ఆ శ్వాసకోశం ఆగిపోయినపుడు
నేను మూగవోయిన
ఆకాశాన్నయ్యాను

నా నిశ్శబ్ద సముద్రంలో
తుఫాన్ చూడలేని లోకం
నా శోకండాన్ని
ఆలోకించాలని
చెవులు నిక్కబొడిచింది
నిన్ను
నా నుంచి దూరం చేసి
మత్తులో ముంచిన చేతులే
నిన్ను మట్టి చేస్తుంట్టే
నేను నిస్తబ్దనైనపుడు
నా చూపులోకి
చూడలేని
ఈ జనాంగం
నా కన్నీళ్ళకు
ఉగ్గిన్నెలు బట్టి
నా గుండె లోతును
కొలవ చూసింది
'వీరేమి చేయుచున్నారో
వీరికి తెలియదు'
అని నేనంటే
నన్ను వీళ్ళు రోజూ
శిలువ వేస్తారు
అందుకే
నేను
ఒక్కడుగు
ముందుకేస్తాను
వీళ్లు నా వెనుక నడుస్తారు

*27-9-96*

# పురుడు



పచ్చి పొదల
పొదిగిట్లో
నెత్తుటి చార

జొన్న కంకి కోరల్లో
చినిగిన చీర

మిరపమళ్ళ చాళ్ళల్లో
బద్దలైన బతుకు

పత్తి చేల పట్టెల్లో
పగిలిన గాజు

సవర గూడెంలో
అమ్మోరు కేక

నింగి కొసలో
మండుతున్న మంట

ఎలుగ్గొడ్డు మాడును
పగలేసిన మలాట

ఏటి పాయలో
పుట్టిన సూరిగోడు

*(హరిత విప్లవంలో నెత్తురోడుస్తున్న దళిత స్త్రీ)*
*15-8-96*

# నగరాన్ని దాటుతున్నాను

మురుగు కాలవ అద్దంలో
దీపాల పందిరి ముఖం చూసుకుంటుంది

పుట్టిన బిడ్డకు పొత్తిలిలేక
చావు అంచుపైనే కునుకు తీస్తుంది



నగరానికి నిద్రలేదు
నగరం శవమై నవ్వుతుంది
కళేబరమై కౌగిలించుకుంటుంది

మర్వాడీ బొట్టులో
తెగిపడ్డ వేలిముద్ర
కిళ్ళీ కొట్టులో వేలాడుతున్న గుట్కా
పుండుకు పురుడుపోస్తుంది

కాలే కడుపును వెక్కిరిస్తున్న రొట్టెముక్క
నగరం పులికి
తేపులాగిపోయాయి
నక్కలు నాట్యం చేస్తున్నాయ్
నగరం నన్ను కౌగిలించుకోకముందే
నేను నగరాన్ని దాటుతున్నాను

*(ముంబాయి చూశాక)*

# అస్మిత

సౌందర్యం ఒక వురి
శరీరం ఒక బలి



నేను విప్పుతున్న
ప్రతి వలువ
నా శరీరం పొర అని
ఆనాడు మీకు తెలియదు
నా అంగాంగాల మీదకి
ఎగబడ్డ కళ్ళని తోడేద్దామని
నా గోళ్ళు చాస్తే
అవి రంగుల వలయాలని
మీరు కేరింతలు కొట్టారు
కనీసం అట్ట గూడా తెరవక ముందే
నా గుండె పుస్తకం చెదలు పట్టింది
సీత భూమిలో కలిసిపోయిందంటే
దాన్ని హత్యని ఎవరంటున్నారూ?
రాముడికి ఉరిశిక్ష ఎవరేస్తున్నారూ?
నా చావులేఖ నీకు సాక్ష్యమయ్యింది
ప్రతి హత్యకి ముందే
భారతంలో కథ పుడుతుంది
భగవద్గీత ధర్మమౌతుంది
మృతినైనా - నేను తల్లినిరా!
జననం నా మాతృక
నా శవపరీక్షలో
మీరు కోయలేని నా కనుగుడ్లు సాక్షిగా
ఇక హంతకులు తప్పించుకోలేరు

*(సినీ నటి స్మిత మరణవార్త విని*



# కొంప

కొత్త పాత సందుల్లో
బతుకు సజ్జగింజ బద్దలై నలిగింది

ఎసరు నీళ్ళల్లో పిసరు బియ్యం లేక
కూటి కుండలో తుఫాను రేగింది

దొరోడి సావిట్లో వంగిన నడుం మీద
పరం బరువుపడి కాళ్ళు గింజుకున్నాయి

సంటోడు అమ్మ రొమ్ము పట్టి
ఆకాశాన్ని తంతున్నాడు

కుక్కి మంచంలో మా తాతకాళ్ళు
కుంది కట్టు సందుల్లోంచి నులకతాళ్ళై వేలాడుతున్నాయి

పాచార గట్టుకొని మా ఆపె
అమ్మోరు పోసిన కొడుకు కాళ్ళ దగ్గర కాలవై పారింది

ఉట్టిలో ఉత్తగా ఉప్పచ్చడి సట్టి
వొత్తిమాడిన బుడ్డి కొడిగట్టి నల్లచ్చరాలు గీస్తంది
ఏందో కరువొచ్చినప్పుడల్లా
మా కొంపింతే



# తెప్ప

కడలి కూతకు లేచిన బెస్తపల్లె
పడవ వొడిలో చందవాల జాతర
ఎంద్రకాయ గుంపులకు వెంటబడ్డ బుడ్డోడు
వలల పందిరికి రొయ్యల లాంతర్లు
కనుల సారల్లో
ఆకాశపు ఏరు
ఏటి నవ్వుల్లో తెప్పతిర్నాల
చీకటినిద్రించిన సంద్రానికి జోలపాట



# కుదిబడ్డ ఆకాశం

రంగు పుట్టించిన
నేత్రంలో
వెలుగు మరణం

పడుగులెంబడి
పరుగులెత్తిన ఎండిన రొమ్ము
కుదిబడ్డ ఆకాశం

అతికిన పోగు
తెగక ముందే
చచ్చుబడిన
వేళ్లు

మగ్గం మట్టితో
వస్త్రశిల్పాన్ని
సృష్టించిన
జక్కన
ఆకలి చక్రం కింద
నల్లి చావు

చలి చీమ
పుట్ట మీద
నిప్పుల కుంపటి
కరువు బురదలో
కరిగిన నీటిబుగ్గ
రణం కానిచోట
చావు పురాణమయ్యింది
కన్నీటి బిందువులో
చల్లబడిన అగ్గి

ప్రభుత్వం వారి చిట్టాలో
పెరుగుతున్న పేజీకి
ప్రకటించిన
బహుమతులు
ఏమైనా చేయండి
పేజీలు పెంచండి

*(గుంటూరు జిల్లా భట్టిప్రోలులో నేతన్న ఆకలిచావుకు స్పందించి)*

# ఇకనైనా జీవించండి....

నేను
కాలి స్లిప్పర్‌లా
వదిలిన రాయల్‌భవన్
ముందు నా శరీరాన్నుంచి
స్వేచ్ఛను భరించలేని కనుల్లో
నీటి బిందువులు కురిపిస్తున్నారా?



మనిషిగా జీవించడానికి
నేను బెత్తెడు నేలకోసం
మీ కోటంతా కలయతిరిగినప్పుడు
నాకు కాస్తంత చోటివ్వలేకపోయారు
మనిషినున్నానని నేను చేసిన చప్పుడుకే
కదా!
మీ చలువరాతి సమాధుల వైపు
ప్రపంచమంతా ఒక్కసారి కన్నెత్తి చూసింది

మీ భవంతులు
యంత్ర పరికరాలు
విద్యుత్ కెరటాలు
లెన్స్ కెమెరాలు తీయలేని
నా గుండెఫోటో
కెమెరాల వేటకుక్కలకు
అక్షరాల నిండా మాంసపు కండల్ని
పొదిగి అమ్ముతున్న అధిపతుల
హంతకశాలలకు దొరకలేదు కదా?

మీ జెండాలను
నేనెప్పుడో జయించానే!
వాటినెందుకు ఇప్పుడు అవనతం చేస్తారు!
లక్ష కోటగోడలు
పిడికెడు గుండె లేకుండా వ్యర్థమని,
మీరు వేస్తున్న ప్రతి తలుపు
బద్దలు కొట్టడానికి
'దయానా' డైనమైట్ అవుతుందని
మీకు తెలియదా?
చూశారా!
మీ ఫిల్మ్‌రీల్ల నిండా
బంధించిన నా శరీరపు విలువని
ఒక్క సెకనులో ధ్వంసం చేశాను
ఇకనైనా జీవించండిరా!
మరణించింది మీరుకానీ
నేను కాదురా!
నేను మరణాన్ని రణం చేసి వెళుతున్నాను
యుద్ధ ప్రియులారా!
నేను కూలగొట్టిన కోటగోడల దారిలో
మీరు స్వేచ్ఛాగానం చేస్తూ నడవండి
నా సమాధిమీద వీళ్ళు
మళ్ళీ కోటగోడ కడితే
మీరు కూల్చుకుంటూ వెళ్ళండి
నేను స్వేచ్ఛకోరే
సైన్యానికి
మార్చ్ బ్యాండ్‌నవుతాను

*(దయానా స్మృతిలో)*

# నెత్తుటి నచ్చత్రం



నచ్చత్రం
నెత్తుటి బొట్టయి రాలింది

కడలిపోటు
కారు మేఘంలో కలిసింది
కాగుతున్న దప్పి
గుండె పగిలింది
ఆమె అమ్మ
కనడమే కాని
కాదు ఆమెకు తెలియదు
అలుపులేని
జీవిత సమరం
పురుడు
పుడమికి నేర్పింది
ఆమె కళ్ళలోని మంట
బిడ్డకి కాగడా
కాలే కడుపుకు
నిద్రలేదు

రాజ్యం కూలేదాక
ఆమె కేక ఆగదు

రేయ్ అన్నా!
సమాధి పెట్టెలో పెట్టి
వెనక నడవడం
కాదురా!
ఆ నెత్తుటి మంటలో
మళ్ళీ పుట్రా

*(కారంచేడు పోరాట వీరురాలు రత్తమ్మ స్మృతికి )*



## ఎఫ్.ఐ.ఆర్.

ఏం జెప్పమంటారూ
మా ఆయనకి తలపగిలి
నెత్తురు వార్లవుతుంటే
దున్న పొడిచిందని చెప్పమంటారా?

ఏంటీ! గట్టిగా మాట్లాడితే
మా ఆయన్నే బొక్కలో దోత్తారా!
ఎందుకు?
"దొరసానమ్మ రైక సించాడని"
అళ్ళు కేసు పెట్టారా

అయినా నాకు తెలియకడుగుతాను
మా ఆయన సించినాక
అయమ్మ రైక తొడుక్కుందా?
తోడుక్కున్నాకే రైక సించాడా?
వొక్క మాటడుగుతా
మాల మాదిగోళ్ళు ఏనాడన్నా
ఆళ్ళ పాక గోడ దాటారంటయ్యా .!

ఎనకిట్టాగే
సంకు కంకి కొరికినసందుకే
మా 'కాకోణ్ణి' కాలవలో దొక్కారు

ఎందుకొచ్చిన గొడవ
ఎట్టాగట్టా రాజీ చేసుకోమంటారా
ఇంతకంటే ఏమంటారులే
మీరు కూడా ఆళ్ళ కులపోళ్ళేగదా .!

యస్సై గోరూ. !
కాలే కడుపును
కెలకమాకండయ్యా!
కారుసిచ్చు రేగుద్ది.
కేసు పెడితే పెట్టారుగానీ .
మా అయన్ని పెద్ద మొగోణ్ణి జేసేరులే...



## తల్లీ

నేను చీకటిని
వెలుగుకు ఉగ్గుని
దిగంబరానికి అంబరాన్ని
చినిగిన ఒంటికి
మట్టిచీర గప్పి
వెలుగు పులుగు నుంచి రక్షిస్తాను
రూక నా చెమట చినుకు
నేను గాజు బుడ్లకు
పారిపోయే పిరికి పందనుగాను
నీకు భయపడి మంచురాజ్యాలు
కోట్ల దీపాలు వెలిగించుకుంటున్నాయి
వాళ్ళు మార్చుకునే ఎర్రగులాబీల
రెమ్మల్లో నేనున్నాను
నేను తెల్లదొరలకు ఉరిని
నల్ల బిడ్డకు తల్లిని
నేను చీకటిని

## దొరికిందంతా....



వాస్తవం
వ్యాధి నన్ను వేధించటం లేదు
ఇదీ వాస్తవమే
నా కాన్సర్
నిన్ను బతికిస్తుంది
అందుకే
నేను జబ్బును ప్రేమిస్తాను
ఎందుకంటే
ఒక జబ్బు మరొక జబ్బుకు
మందు కనుక
నిజంగా చెప్తున్నాను
మరణించినోడొక్కడే
బతుకుతున్నాడు
అందుకే మరణం
ఖరీదయింది
మద్యానికి మరణం లేదు
నిషేధం లోంచి
ఇది పుడుతుంది
ఎతికే వాడే దొరుకుతున్నాడు
దొరికిందంతా చీకటి
దొరకందే వెన్నెల
నిజం చెబుతున్నాను
వ్యాధి లక్షణం మాత్రమే
దాని మూలం నిక్షేపం
నిక్షేపాన్ని భద్రపరచండి
వైద్యం వర్ధిల్లుగాక    ఆమెన్

(తన దగ్గరున్న నల్లడబ్బంతా కాంగ్రెస్‌దేనని 'సుఖరామ్'
చేసిన ప్రకటనకు)



## తోలు తిత్తి

కాలుతున్న నా శవం వాసన
నీకు సుగంధమయ్యింది
నీకు తెలియదు గానీ శవానిక్కూడా
ఒక నాగరికత వుంది

పుర్రె మంటకీ కట్టెకీ లొంగకుండా
మారాం చేయగలదు
నా చిరునవ్వు వెనకున్న నల్ల మబ్బుని
నువ్వెన్నటికీ అందుకోలేవని తెలుసు
బతుకు పుస్తకానికి అట్ట మారేటప్పుడల్లా
అక్షరాలు మారవని నీకు తెలియదు
ఒంటి మీద పూసే ప్రతి లేపనమూ
నీ పాడెపైన తెల్లని గుడ్డని నాకు బాగా తెలుసు
శరీరం కూడా కుళ్ళి పొద్దని
నీవు రూపాయి ఇచ్చి నాకు నిరూపించావు
మా సంటోడు కుతి తీర్చుకోవాల్సిన పాల బొట్టుకి
నువ్వు నెత్తుటి టోపి పెడితే
వాడు గుటకేస్తూనే నువ్వు పెట్టిన గాటు గుర్తించాడు

నువ్వు గొంతు నులిమి పుస్తెలాక్కొస్తే
నా మనియార్డర్
కుక్కి మంచంలోని ఎండిన పేగుకి గంజి పోసింది
నావొల్లు నల్లరేగడి నేల
అది సాగు చేసినోడికి పంట భూమి
చచ్చినోడికి వల్లకాడు
నాలుగ్గోడల్ని నేను కూలగొడితే
బైటపడ్డ కిరణాలన్నీ
నా నగ్న దృశ్యానికి టార్చిలైట్లయినాయి
నేను నా వాడదీపం కాడ అల్లాడ
ఈ ఎర్రలైట్లో మరీ ఇంత దగ్గరి గానా

ఒరే !
ఎక్కడైనా చరిత్ర గుండెకాయదే గానీ
తోలు తిత్తిది కాదు

# శవం తెప్ప

క్షణం కింద భుజం మీద కొట్టుకున్న అల
క్షణం తర్వాత కట్టెయ్యింది
ప్రకృతి కృతి శవంతెప్పమీద ఒడ్డు చేరింది
అత్యాచారం శరీరానికే కాదు
ప్రకృతికి కూడా
సముద్రం నిప్పుల చితైంది
రొమ్ముబట్టిన కొబ్బరి మట్టే
గొంతు తెగేసింది
యీల పాటకు ఊయలూగిన నది
శవాల పాన్పయింది



ఆకాశం మీద రాజ్యం గద్ద
మరణం గుట్టని మట్టిదిబ్బనుకుంది
వీడు కాడైనాక కాపరెవడు? కరణమెవడు?
పెనుబాము కూడా కాటేయకుండానే
తలవాల్చింది
రాజ్యం కబోది
గాయంలో తానమాడుతుంది
రేయ్
కూలేదీ కాలేదీ
రాయీ కాదు రాజ్యమూ కాదు
అంత పెనుతుఫానులో కూడా
ఇంత వేడిబెట్టి
గర్భస్థ శిశువును బతికించుకున్న తల్లేరా

*(కోనసీమ తుఫానుకు ఎద పాగిలి)*

# నా సంఖ్య ఒక్కటే



నేను భగ్నమై
నీలో విస్ఫోటనమయ్యా
నేను కాగీ కాగీ
నీలో స్రవించా
నేను సూర్యుణ్ణయి
నీలో ఉదయించా
నేను కణాన్నై
నీ రక్తంలో రంజితమయ్యా
నేను ప్రకృతినై
నీ కృతినయ్యా
నేను అనే ప్రశ్నకు
సమాధానం నువ్వైతే
దీని జవాబే
స్నేహమయింది
స్నేహమా
రెండూ అబద్ధం
ఇక నా సంఖ్య
ఒక్కటే
స్నేహమా!
నువ్వెక్కడో లేవు
విశ్వమా! నీ బతుకుసారం
స్నేహమే!
అందుకే నిన్ను నేను
ముగించ లేను

# చారిక

ఆ చెంపలు
ఏటి పాయల్లా
చారికలు గట్టాయి
మెడ చుట్టూ మట్టి
చాళ్ళు గట్టి
చెమట బిందువుల్ని
దిగమింగుతున్నాయ్



తల గోరింటాకు రెమ్మ
నిమురుదామంటే
అది చేతిని పండిస్తుంది
మెడలో వేళాడుతున్న
సత్తుబిళ్ళ
భయాన్ని పోగోడుతున్న
కొరివి దీపం
పీక్కుపోయిన పొట్ట
రొట్టె ముక్కకో సవాల్
ముంబాయి జాతర్లో
మర్వాడి బొమ్మ
వజ్రాల ముంగెరలో
చిరిగిపోని చిరురూపం
కాలే కొలిమిలో
లేస్తున్న నిప్పురవ్వ
ఇక కాసుకోండి
మంటలు చుట్టుముట్టితే
బాధ్యత మాది కాదు

*(ముంబాయి మురికివాడల్లో*
*పిల్లవాణ్ని చూసి)*



# గుండె దీపం

అమ్మ చిన్నప్పుడు
మజ్జిగ చిలికిన చేత్తో
నా గుండెల మీద రుద్దినట్లు
మాపటేల సముద్రమ్మ నా గుండెల్ని నిమిరింది

భూమినీ ఆకాశాన్నీ రెండు చేతులా వూపుతూ
స్టీమర్‌గాణ్ణి గుండెలమీద నిలబెట్టుకుని
సర్కస్ తల్లిలా కత్తి అంచుమీద నవ్వుతూనే వుంది

అలల రంగుల రాట్నంలో కూర్చుంటే
అమ్మ వొడిలో కూర్చున్నట్టే!
ఒడ్డు యిసిక పర్రల్ని తాకుతూ
ఎక్కడిదో జోలపాట

ఆ నవ్వు మాయదు
ఈ పాట ఆగదు

ఓరే మనిషీ !
కాస్త సముద్రమ్మ గుండెలో పవళించరా
గుండెదీపం వెలుగుద్దీ !

# నేను చూశా



మా నాన్న మెడచుట్టూ చేతులేసి
ఆయన భుజాల మీద నుండే
నేను నక్షత్రాల చెమ్కీల ఆకాశం ముఖాన్ని చూశాను
ఆయన మెడమీద నుండే
నేను సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ సమస్త ఖగోళాన్నీ చూశాను
మా నాన్న మెడకి ఉరేయటం నేను చూశాను
నాకు ఏరిశనక్కాయలు వొడిగట్టి పోసుకొచ్చిన
ఆ లుంగీ నాకుబాగాగుర్తు
ఆ లుంగీని ఉరితాడు చేయటం కూడా నాకు గుర్తే
చీకటి కొట్లో గతగతా శబ్దాలు
మెడ ఎనికలు పటపటా విరిగిన చప్పుళ్ళు
ఏడు సువ్వలవతల ఏలాడుతున్న మానాన్న కళ్ళలో
ఈ భల్లూకాలు బలితీసుకున్న యన్నసైగ
నేను చూశాను
చిన్న ఉరుముకే నన్ను పొదిగిట్లో దాచే మానాన్న
దగ్గరకు రావొద్దన్న చూపులో ఒక కలువరి గిరిని చూ॰॰ను

మూడో రోజు రావటానికి
మా నాన్న ఏడు మాటలు చెప్పలేదుగానీ
నేను మాత్రం సాక్ష్యం చెబుతున్నా

ఏడు సువ్వలెనకాల
రోజూ ఓకారంచేదు

*(ఒంగోలు లాకప్ హతుడు ఏడుకొండలు కూతురు సరిత తన తండ్రిని పోలీసులు చంపిన ఉదంతాన్ని బహిరంగంగా చెప్పిన సాక్ష్యానికి సాక్ష్యంగా)*



## ప్రేమ లేఖ

కలకత్తా
కనుల్లో నుండి కాంతిరేఖ
అస్తమించింది
ఆ మేడల మిద్దెలపై
ఎగురుతున్న ఎర్రజెండాలు
మురుగు కాలువ పక్కన
కుప్ప తొట్టిలో
బిడ్డ నెత్తుకొన్న తల్లి
త్యాగానికి తలదించాయి

ఆ వీధుల్లో
చీమూ నెత్తురుతో తడుస్తున్న
అమ్మ చేతులు
అందాల పోటీలో
పాల్గొన్న జ్యోతిబసు మనవరాలి
నెయిల్ పాలిష్‌కు

సిద్ధాంతాలా? ఆచరణా? అని
సూటి ప్రశ్న వేశాయి

అమ్మా!
రాయల్ భవనాల్లో
రాతిదిమ్మెల్లా జీవించే కంటే
కరుణ సముద్రాలై
ప్రపంచంలో ప్రవహించకూడదూ
అని ఎలిజిబెత్ మహారాణిని
ప్రశ్నించిన
ఆ కళ్ళు ఇక లేవా?

అమ్మా!
అణు సింహాసనంపై
ఆరని అగ్నిలా ఎందుకు మండుతావు
ఆ తెల్లని చిరునవ్వుతో
మానవత్వాన్ని వెలిగించమని
అమెరికా అధ్యక్షుణ్ణి
ప్రశ్నించిన ఆ చూపుడు వేలు
ఏదమ్మా!

అమ్మా!
బిడ్డల్ని కనడంవల్ల కాదమ్మా
తల్లయ్యేది
బంగారు శిలువ గుండెపై
వేలాడితేగాదమ్మ పోప్ అయ్యేది!
శిలువపై వేలాడిన
శిరస్సును

వేలం వేస్తున్న రోజుల్లో
ఆ శిరస్సుకు ఆయువు
పోసి
శిలువకు చిగురులు తొడిగావు
కత్తి ప్రయాణం చేయలేనంత దూరం
కరుణ ప్రయాణం చేస్తుందని
బుద్ధుడు నిరూపిస్తే
అమ్మతనానికి
మతం, ధర్మం కాదు
మానవత్వమే కొలబద్దని
రుజువు చేశావు

అమ్మా!
నీ ప్రేమ పతాకాన్ని
ఏ మరణమూ అవనతం
చేయలేదు
నీ కరుణగీతాన్ని
ఏ ఋతువు అడ్డుకోలేదు
విశ్వ ధర్మాన్ని
మరొకసారి రుతింపచేసిన
అమ్మా!
క్రీస్తునుగన్న మేరీమాత కూడా
అమ్మా! అని నిన్ను పిలుస్తుంది చూడు
అమ్మంటే! అర్థం
బిడ్డకీ, అమ్మకీ
అమ్మకాగలగడం

*(మదర్ థెరిస్సా స్మృతిలో)*



# నగరంలో నడవొద్దు

పువ్వుల్ని కూడా
నెత్తుటిలో వేపుతున్నారు
నవ్వుల్ని కూడా
నిప్పుల్లో కుక్కుతున్నారు -
చేతిలోని కట్టెపుల్లకు
శవదాహం ఎందుకు?
చీరలొలుస్తున్నది
రక్షణ కోసమంటున్నారు
అర్ధరాత్రి కేకలో
నీకేదో కిక్కు
విరగుతున్న ప్రతి ఎముకా

నీకో హేల

మృతిలో నీకేదో

బహుమతుల స్మృతి

పట్టీలు పెరిగే కొద్ది

నీ కళ్లు కోరుతుందొకే వర్షం

ఇప్పుడు నేను క్రూరమృగాలకు

భయపట్టం లేదు

పౌరుడా!

నీకు రక్షణ కావాలంటే

నగరంలో నడవద్దు

ఎలుగ్గొడ్డు కూడా

వాడితో ఓడిపోయానని

తలదించింది

కొండల సాక్షిగా

ఇక ఆకాశంలో

వర్షం కురవటం లేదు

నెత్తురు తప్ప

*(ప్రకాశం జిల్లా ఒంగోలు దళితులు ఏడుకొండలరావు లాకప్ డెత్‌ను నిరసిస్తూ)*



# నీలి కేక !

పంటతల్లి కడుపులోంచి
కమురు కంపు
సముద్రంవార మృత్యుతోరణం
ఏటిగోడుకు గర్భస్రావం
ముళ్ళ తుప్పల్ని ధరించిన శిరస్సు
ఈ యేటి కన్నీటికి యిక స్వస్తి
యుద్ధంలో బతుకు
బతుకులో యుద్ధం
నూతన సంవత్సరానికో కరవాలం
రాబందు ఆహారనిధుల కోలాహలం
ఆకలి ఆకాశంలో నక్షత్రాల పుళ్ళు
కొత్త యేటి పండుగలో నరబలి హేళి
ఇక చావుడప్పు
వరసమార్చి వేస్తున్న నీలికేక

# మళ్లీ ఈత

రోజూ పంటనిచ్చే
కొడుకు గాని కొడుకు
కాళ్ళు తెగి
ఇంటి ముందు పడ్డాడు

తల తెగిన మొండెం
మెడలో చుక్కలేని వొట్టిముంత
దావాద్రిగా చూస్తుంది..
పేగు తెంచుకున్న పడవ
గుండె పగిలి కూలింది
ముళ్ళకంచె కన్నీటిలో
నెత్తుటి ధార కురిసింది
అలల పేగుల్లో
అరుస్తున్న అమ్మ
అడవిని పెనవేసిన వలలో
మాయని కన్ను చెబుతున్న కథ.
అమ్మా! సముద్రమ్మా!
ఆటులో పోటులో
మా అమ్మ శిశువును కంటే
నువ్వు మృత్యువును కంటున్నావేమమ్మా
ఏమైనా.
తెల్లవారేసరికి
చిరునవ్వు నవ్విన నీ నిబ్బరం లోనే
నా ఈత.

*(తూర్పుగోదావరి జిల్లా దొంకల మండల ప్రాంతంలో తుఫాను బీభత్సం)*




# నిప్పుకవిత

వెన్నెల భామ
చీకటి రాజుకై
వెంట బడుతోంది

చందమామ
చద్దిబువ్వలో
ఉల్లిగడ్డయ్యింది

ఆకాశంలో
నక్షత్రాలన్నీ
సముద్రపు ఒడ్డులో
ఎండు చేపల్లా మెరుస్తున్నాయి

పూలగుత్తులన్నీ
నూనెలేని తలవెంట్రుకల్లా
ధర్నా చేస్తున్నాయి.

మండుటెండల్లో
కాలిన గుడిసెల బూడిదలా
తెల్లమబ్బులు
కమ్ముకుంటున్నాయి

అంతఃపురాల అడవుల్లో
అలంకారాల ఆకు రాలింది

ఇప్పుడు ప్రతీకలు
పిల్లి మొగ్గలేస్తున్నాయి
ఈనాడు
అంతరంగానికి అద్దంపట్టే
మనిషి బాసకోసం
గుప్పెడు గుండెలో దాగున్న
ప్రేమాణువుకోసం
కవి తన్ను తాను చెండుకుంటున్నాడు
ఊరంతటికీ ఉరిబడి
కాడు మంటల్లో
నిప్పు కవితలు రాస్తున్నాడు

22-1-97

# బ్లాక్ డే

ఈ రోజు
నా గొంతునేదో తాడు బిగుస్తుంది
నా కళ్ల ముందే
నా తండ్రి కనుగుడ్లెవరో పీకుతున్నారు
నిజమే
ఆ కవాతుల ఉక్కుపాదాలు
నా చెల్లి గుండెను చిదుముతున్నాయి
ఆ శకటాలు
నా అన్న వేనుడి తల మోసుకెళ్తున్నాయి
ఎగురుతున్న పతాకలో
నా నల్లని నెత్తురు
మోగుతున్న శతఘ్నులలో
నాకు బెదిరింపు
నెత్తుటి దోసిళ్ళకు
బంగారు పతకాలు

ఎవడువాడూ!
ఈ దేశం నాదని బుకాయిస్తున్నాడు
రేయ్!
ఇనుప గుగ్గిళ్ళతో పేనిన కోటగోడలు సైతం
పటపటా కూలి
కొంగు కట్టుకు సమరం చేసిన
తల్లి జుట్టు జెండాగా ఎగిరే రోజుందిరా
అప్పుడు జనవరి ఇరవయ్యారు
బ్లాక్ డే!

*26-1-97*



## నిరుడు

నిరుడు
ధర్మాసనం
నాకు వేసిన వురికి
మెడ ఉక్కుకవచమై
ఎదురు తిరిగింది

నిరుడు
ఏడు సువ్వలవతల
నన్నేసిన శిలువ
కారుమేఘమై
నెత్తుటి వాన కురిసింది

నిరుడు
దేశం ముళ్ళకంచెలో
చీలిపడిన నా దేహం
అంబుల పొదిగా
ఆవిర్భవించింది

నిరుడు
నా శరీరంపై
రాజ్యం చల్లిన
నిప్పుకణికలు
కడలి అలల్లో
కావ్యాలల్లుతున్నాయి
నిరుడును
చీల్చుకొని నేను
కొత్త ఏడు
యుద్ధ శిశువునయ్యాను
ఇక
నా శిరస్సు
వేళ్ళు తెంచటమేగాని
తెగిపడటం లేదు
ఇక కృష్ణుడి
బొటన వేలిలో
దిగిన బాణానిదే
చరిత్ర



# తాడిసిరేసిరా

ఆ మొకం చూడండమ్మా!
ఎట్టయి పోయిందో
నా కూతురే !
ఎన్నో యేళ్ళు లేవు
ఆ నడమంతర పోడు
ఇందిరమ్మ కొడుకు
ఇమానం కూలిసచ్చిండే
ఆ యాలే పుట్టిందమ్మా!

పిల్ల బువ్వేసుకుంటే ఆళ్ళత్త
పళ్ళెంలాగి కుడిత్తొట్లో ఏసిందంటమ్మా!
కారపు గడ్డలు తిని
దీని కడుపులో పూతపూస్తే

అది ఉప్పు నీళ్ళించ్చిందంట!
అల్లాడి పోయింది నా బిడ్డ!
అమ్మా మీరే చూసేరుగా
యార్నాల్లో ముక్కాలపీటతో సహా ఇచ్చా
తిక్కెక్కినపుడల్లా ఆ తాగుబోతోడు
'మీ వోళ్లు ఏమిచ్చారే' అని
నా బిడ్డను ఇరగతంతాడమ్మా!
కూలి డబ్బులు తెమ్మని అళ్ళత్తేమో సతాయిత్తది
'ఎవడి కోసమెళ్ళావే' అని
ఆడేమో జబురుతాడు
దీనికి జరమొస్తే
కాసిని చిట్టుడికి నీళ్ళు ఇయ్యగూడదమ్మా!
తలసమరు లేక దాని తల చిట్టడవయ్యింది
మోపులు మోపులు గడ్డిమోసుకొత్తదే
చారడు చల్లబోస్తే ఏమయిందమ్మా!
దాని చెంపలు చూడండి
మట్టి పెళ్లలన్నా నయం

నా బిడ్డ ఇక్కడుంటే
నాలుగు రోజుల్లో వల్లకాటికెళ్తాది
ఈళ్ళు పీనిగని కూడా
పీక్కు తింటారే
చెట్టుకు కాయ బరువా!
రామ్మా! ఉన్నదేదో తిని
ఊపిరి నిలుపుకుందాం
ఆడుకట్టిన తాడు
వాడి మొకానే ఇసిరేసిరా
ఏ పెద్ద మనిషి ఏం చెబుతాడో చూద్దాం

# నేను ఆమ్రపాలిని

మనిషిని శిలను చేస్తే
శీలం నిప్పులా వెలుగుతుంది
కారం కొట్టినవాడే
నా అంధత్వానికి
సానుభూతిని ప్రకటిస్తున్నాడు
ధర్మశాస్త్రాల ద్రవం
నాపై కుమ్మరించి
భారతమ్మ సౌందర్యానికి
బట్టగట్టారు
నా పాదవాటి వెంట్రుకలు చూస్తే
నీకెందుకంత భయం
అడవులను నరికినట్టు
వాటిని నరికితే
అవి తుఫాను తెస్తున్నాయి
నీవు ఓడిపోయినపుడల్లా
నా చేతులకు
బేడీలవుతున్నావు
నా పేగు తెంచుకొన్న వాడికే
నా శీలాన్ని కాపాడమని
కొరివి దీపాలిచ్చి
బాల శిక్షలు చెబుతున్నారే
శీలం అంటే మరణం కాదురా
సృజనం, శిల్పం, వ్యక్తిత్వం
ఆమ్రపాలి గుండె దీపం
నా శీలం
వసంత సేన
ఔదార్యం
నా శిల్పం



మాధవి జీవన వేదన
నా శృతి
నాలో క్షణక్షణం సృజనం వుంది
ప్రకృతి శృతి
దీనికి ప్రాణం
శాస్త్రుడా
నీవు గోడలు కట్టేకొద్దీ
అంతరంగాలు
ఫిరంగులవుతున్నాయి
మనుష్యుడా
శరీరాన్నుండి
శీలాన్ని వేరుచెయ్
ఒకటి ప్రకృతి
రెండోది అనుకృతి
మరణాన్ని
జయించే ప్రతిదీ రణమే
అందుకే
నేను నన్ను బద్దలు చేసుకొని
అగ్నికీలనవుతున్నాను
ఇక శీలలు కొట్టు చూద్దాం
ఇప్పుడు నేను
శిలనీ చేతినీ కాల్చుకొంటూ పోతున్నాను
సృజనం రణం
ఇపుడు నా శిరస్సును ధరించాయి
అందుకే
నేను ఆమ్రపాలిని
ఇక నన్ను జయించు చూద్దాం

# చీకటి లాంతరు

చీకటి గోడల్లో
నా వంటి మీద
నీటి బుగ్గల జాతర
మా ఇంటి తడికెల బొక్కలకు
చీకటి మాట్లేశాక
మా నులక మంచం
ఇసినగర్ర అల్లకం ముద్రలు
నా వంటి మీద అచ్చయినాయి
నిలువెత్తు చీకటి అద్దంలో
నా బొమ్మ నేను గీసుకొంటున్నాను
పదిమూళ్ళ చీకటి చీర
నా వళ్ళంతా కప్పింది
నల్ల మబ్బు మా ఇంటిముందు అడుగేసి
మల్లె మొగ్గకు పురుడు పోసింది
ఎలుతురు నా కన్నీటిలో తడిసి
ముద్దవుతోంది
మా వూరి నడిబొడ్డులో
వేలాడుతున్న కరెంటు బుడ్డి
తూర్పు పాలాన
నా వెంటబడ్డ మరపుటెద్దు
మా మాలపల్లి
చీకటి లాంతరులోనే
నా కనుపాపల్లో కొత్త ఏరు

# నల్ల సముద్రం

పగిలిన అత్తరు సీసానుండి
దుర్గంధం

ఎందుకో
బెడ్‌లైట్
గాయంలా మండుతోంది

పూలపాన్పులో
పోస్ట్ మార్టమ్ గుర్తులు

కొట్టే ప్రతి బెల్లులో
ఒక చార్జ్ షీట్

శరీరానికి ఖరీదు పెరిగే కొద్దీ
గుండె కాయల మరణం రేటు

ఈ గదిలో గుండెకు మాత్రం మరణం లేదు
అద్దం వీపులో కనిపిస్తున్న మరోదృశ్యం
కుటుంబం నిర్జీవ బందిఖాన
పూజా మందిరంలో
శవం కొవ్వొత్తితో దీపారాధన



ఇంటి లాకప్‌లో శీలం శిలువ
ఆ రెండు చేతులా ఉక్కుగోళ్లే
ఒకటి శరీరాన్ని
రెండోది గుండెని
ఎందుకో ఆమె చీల్చేకొద్దీ
నల్ల సముద్రమవుతుంది
సంఘర్షణకు చావేలేదని
పేలిన గ్యాస్ స్టవ్
వేసిందో కేక

# తంబుర పాట

మా ఇంటి ముందు గట్టిన
చియ్యాల తోరణం
నా జిహ్వాలో
జల చిత్రాలు గీసింది

చట్టిలో తెర్లిన
బురదమట్టల పులుసు
నా నాడీమండలాన్ని
విప్పార్చింది

చేదు పక్కెల్లో
చింతాకు నూరేసి
ఉల్లిగడ్డతో కలియబెట్టి
ఏడి బువ్వలో వడ్డిస్తే
బాలింత మా చెల్లెకు
పాలుబడ్డాయి !

పొద్దున్నే మా 'అమ్మ'
చల్ల చారుతో
చద్ది బువ్వ కలిపి
ఎఱ్ఱగారపు పచ్చడి
నంజు బెడితే
శాస్త్రవేత్తలా కనిపించింది!

మా ఇంటెనక
గతుకుల బండపై
నత్తముక్కలు రుద్ది
ఏరుశవగ పిండితో
ఇగరేసినపుడు



ఇంటెల్లపాది
గుంపు బువ్వతినేవాళ్ళం !

మా అక్కోళ్ళింట్లో
మక్క గట్కలో
ఎల్లుల్లి కారం
ముద్ద చేసి తిన్నప్పుడు,
జొన్నంబలిలో
పచ్చిమిరపకాయ మెదిపి
కొర్ర బువ్వలో
గొడ్డుకారం కలిపి
సుడిపెట్టి తిన్నప్పుడు
నా అంగిలిపై శిల్పాలు పూశాయి

నాకు ఉద్యోగమొచ్చి
బాపనోళ్ళ హోటల్లో
పూటకూళ్లు తిని
నా నరాలు చచ్చుబడ్డాయి !

నేను సెలవుల్లో
కట్టేతకెల్లి వచ్చేసరికి
ఎండొరికిళ్ళు కాల్చి
మా అమ్మ
పున్నీళ్ల బువ్వతో
నంజుపెట్టిన గుర్తు
నా గుండెలో చలువపందిరి కట్టింది

నాడు వెలివేసిందంతా
నేడు ఔషధమయ్యింది
ఏమి తిన్నావు కాదురా
ఏమి పెట్టావురా అని
మా ముత్తవ్వ పాడిన తంబురపాట
తరతరాలకు
మనిషిపాట



## నేను

పగిలిన మబ్బుతునకల నుండి
వెలుగుసౌధాలు నిర్మిస్తున్నాను
కాగుతున్న పాలల్లో
చేయిబెట్టి
వెన్నతంత్రులను మీటుతున్నాను
పూసిన మొగ్గల్ని తాకి
వెన్నెల పూలు పూయిస్తున్నాను
నా కనుల్లోని కిరణాలకు
సంకెళ్ళు వేయాలని
మా ఇల్లు
అద్దాల పెట్టె చేశారు

నా అడుగుల చప్పుళ్ళకు
దివిటీలు పట్టి
నా పాదముద్రలను అచ్చువేసి
ముంబాయి బజారులో
మార్వాడి గళ్ళాపెట్టెకి
అంటించారు

ఆకాశపు గుండెని
పిల్లతెమ్మెర తాకిందని
అడవి ఆడిపోసుకొంది

నేను నిజంగా చెబుతున్నాను
శరీరాన్ని జయించిన నేనే
బతుకుతున్నాను
అందుకే
జరుగుతున్నదేదీ
చరిత్రకాదు
వర్తమానాన్ని జయించేదే
చరిత్ర

దేనినైనా చిత్తశుద్ధితో చెయ్
బద్దలైందే చరిత్ర గాని
బండరాయి చరిత్ర కాదు
వుంటా

*(వెండితెర మీద వెలుగు కోసం)*

# గుండెపూలు



చేతివేళ్లతో
కనుల్లో వెలిగిస్తున్న దివ్వెలు
కనకాంబరాల మాలను
రవ్వల నక్లెస్‌లా పొదిగిన శిల్పి
కళ్లకు విద్యుత్తునందించలేని
మాడిన పేగులు
కాలివేళ్లతో
భూమి పొరల్ని అంచనా కడుతున్న మేధావి
నిశ్శబ్దాన్ని చీలుస్తూ వొస్తున్న
రైలు శబ్దాన్ని గుండె సవ్వడితో పసిగట్టి
క్షణాల్లో రెండడుగులు వెనక్కేసిన
అంతర్వేది
ఎవరీ ముదుసలి.?
ప్లాట్‌ఫారం అంచున
జీవితాన్ని పరచి
క్షణ క్షణం మరణాన్ని జయిస్తుంది
చేతిలో పూల మాల
గుండెలో అగ్ని కీల
రైళ్లలో వలసపోయే
కూలి చెల్లి జడలో
అర్థరూపాయికి పూస్తున్న నవ్వుపూలు
కళ్లుపోయినా
రోజూ పూస్తున్న గుండెపూలు
వాడిపోని పరిమళం
ఆమె ఆత్మగౌరవం

*(బాపట్ల రైల్వే స్టేషన్‌లో ఒక గుడ్డి తల్లి పూలమ్మడం చూసి)*

*26-2-96*

# నాణెం చెప్పిన కథ



ఒక్క అట్టముక్క
కర్రపుల్ల నడ్డం పెట్టుకుని
సూర్య నేత్రాన్ని అడ్డుకొంటుంది
నీ వెనుకున్న గోడ
నీవు వంచిన వీపు మీద
కూలడానికి సిగ్గుపడి
పళ్ళు బిగబట్టి చూస్తుంది
నీవు ప్రతి బూటును
అద్దం చూడందే వదలవనే
నీ చేతిలో పడుతున్న
రెండు రూపాయల నాణెం
నేనే నిజాయితీగా బతుకుతున్నానని
ఖంగున మోగి చెబుతుంది

మధ్యాహ్నం బువ్వతెచ్చిన
నీ కూతురు నుదురు మీద
ముచ్చెమటల్లో పడిన రెడ్‌లైట్‌కు
మౌంట్‌రోడ్ జామయింది

మొదటి ప్రధానమంత్రి
ముది మనుమరాలు
పెళ్ళి కాగితాన్ని
సినిమా పోస్టర్లంటిచే
మీ బుడ్డోడు గాలిపటం కట్టాడు

పార్లమెంటు హాలును
బురద చేసిన
తెల్లపంచె కంటే
నా నిజాయితీ గొప్పదని
మాసిపోయిన
నీ గళ్ళలుంగీ చిరునవ్వు నవ్వుతుంది

*(మద్రాసు మౌంట్ రోడ్డులో బూట్‌పాలిష్ చేస్తున్న సోదరుణ్ణి చూసి)*

*27-2-97*

# సంధ్య



మా ఇంటెనక
నీడ పందిరిలో
కుక్కి మంచం వొళ్లో
మా తాతకు బతుకుపాట విన్పించిన
ఓ సంధ్యా!

జొన్నచేలో
కంకి కంకి నడుమ
ఎఱ్ఱతాచులా పడుకొని
నా చీరమడం కొరికిన
ఓ సంధ్యా!

మా వూరి చెరువు
గుండెలపై
జలతారు దుప్పటి పరచి
మాల పిల్లకి
కనుగీటిన
సంధ్యా !

నల్లనల్లని
దున్నకుఱ్ఱ మీద
బిల్లంగోడేస్తూ వస్తున్న
మా బుడ్డోడి తలకు
బంగారు కిరీటాన్నల్లిన
ఓ సంధ్యా!

చెరుకుదంటు చేలో
నా ఎద చెంగును

సుతారంగా లాగి
నా గుండెల్లో తీయదనాన్ని
దంటులో పాదిగిన
సంధ్యా!

అరటి బోదెల మడుల్లోగుండా
తొంగి చూసి
నా మోకాళ్ల కింద
పచ్చబొట్టు పొడిచిన
ఓ సంధ్యా!

కొబ్బరియీనెల్లో నుండి
దివిటీల పందిరేసి
మొవ్వలోని సుతారాన్ని
చేమంతి రంగులో
నా వీపు మీద అద్దిన
సంధ్యా!

మా తడికెల ఇంట్లోకి
జరజరా పాకి
మా మట్టింటిని
చలువరాతి గచ్చుచేసి
నా ముగ్గులన్నీ చెరిపేసిన
సంధ్యా!

నా చెమట చుక్కల్ని
మీ అన్న సూరిగాడు
కాటేసిపోతే
నా కన్నుల్లో
కనకంబరాలు పూయించిన
ఓ సంధ్యా !

నా గొర్రెల మందని
నీ కాంతుల్లో తడిపి
వెలుగుపూల ప్రవాహాన్ని
సృష్టించిన
సంధ్యా!

ఖాళీ అయిన నా కల్లు ముంతలో
ఇప్ప పూవులా మెరిసి
నల్ల సంద్రానికి
నాగరం బెట్టిన
సంధ్యా!

అంతఃపురంలో
నీ సమాధి మీద
వసంతోత్సవం జరిగితే
నా గుండెల్లో
నీ చిరునవ్వుకి
చిరుదీపాలు వెలిగిస్తాను

ఆసామి సావిట్లో
ఆరుగాలం పనిచేసి
సద్ది కూటితో మొద్దుబారిన
మా బావ
నిన్న నావ మీద
తెరచాప కర్రకు ఆనుకున్నపుడు
నన్ను గుర్తుచేసి
ప్రేమలేఖ అందించావని తెలిసే
రోజూ సాయంకాలం
నీతో ఈ ముచ్చట్లు

*11-3-97*

# సముద్రంమీద నడిచిపోతూ...!

ఎందుకు
అడవినంత నరికి
ఇంటినిండా తలుపులు బిగిస్తున్నారు
చీమలు అంతఃపురానికి
సొరంగాలు చేసి
అడవుల్లోకి స్వేచ్ఛ కోసం
బారులు తీరిన విషయం తెలియదా!
ఎందుకు నన్ను నీ కుండీలో బంధించి
నీ పడకగదిలో
నీ తలగడ దగ్గర వుంచావు!
సూర్యకిరణం
నీ కిటికీ అద్దాన్ని దాటొచ్చి
నన్ను స్పృశిస్తూంది చూశావా!
నా కన్నులు తెల్లకొంగల్లా ఎగురుతున్నాయని
వాటికి ఉచ్చులేయ చూస్తున్నావు
కొల్లేరు దుర్గంధమైందని
తెలుసుకొని
అవి ఖండఖండాంతరాలకు
దాటి వెళుతున్నాయి
నా స్వరం
సైన్య కవాతులకు
మార్చ్ బాండ్‌గా వుందని
నీవు తలవంచి
నా పాదాల వంక చూస్తున్నావు
అవి ఇనప కచ్చడాలను
బూట్లుగా మలుచుకున్నాయి
తమను తామే రక్షించుకొనే



సామర్థ్యాన్ని ప్రకటిస్తున్నాయి
నేను
సముద్రం మీద నడిచిపోతున్నానని
ఆశ్చర్యంగా చూస్తున్నావా
నీ చెక్కల నావ నాకక్కరలేదు
నా మనసు రెక్కలు విరవాలని
నీవు ఆరాటపడ్డావే
అవి నీటినీ నిప్పునూ
జయిస్తున్నాయి
ఎందుకలా
నా నల్లసిరా పేపర్ నిండా
ఎర్రగీతలతో కొట్టివేతలు చేస్తావ్
నా పేపర్ నేనే దిద్దుకోగలను
పండితులారా
నేను అక్షరాన్ని కన్నదాన్ని
నా కొడుకు కన్నెకే పుట్టాడు
నేను తల్లిని కావడానికి
నీ మంత్రపుష్పం నాకక్కరలేదు
నేనిప్పుడు తలెత్తి నడుస్తున్నాను
నా అడుగుల చప్పుళ్ళకు
కొండలు నెర్రెలు పడుతున్నాయి
గొర్రెల కాపరీ
ఇపుడు గొర్రె నీ మందలో లేదు
అదుగో
అటుకొండ శిఖరాన చూడు
ఇపుడు
తలెత్తడమే
యుగధర్మం

# మట్టికూడా నిప్పుకణికే

ఊరు వురుముతోంది
కాటిలోని కట్టెలు
నిప్పుకణికవులతున్నాయి
ధర్మం నాలుగు కాళ్ళు తెగి
మొండెం అవతలి ఒడ్డుకు
చేరుతోంది
వాడ బిడ్డలను చిదిమితే
ఇక సముద్రం అలల్లో
విద్యుత్తరంగాలు



భగత్‌సింగ్‌ను
ఉరితీసినోడు
అస్తమించాడు
నిజానికి
ఈ యుగం ముద్దాయిలు
గడ్డం చంద్రిగాడు
కరణం నరిసిగోడు

మట్టిమనిషిని మరణం
శాసించలేదు
మరణశంఖం వూదకముందే
ఊరును, ఉరిని కన్న
మనుధర్మాన్ని
మంటల్లోకిసరండి
రగులుతున్న మంటల్లో
మట్టికూడా నిప్పుకణికే

31-3-97

# వర్ణాంతరం

ఎన్నెలా ఎన్నెలా
ఆకలేల
నా ఏడిబువ్వలో
పంచదార జల్లి
నా అంగిలిలో
తీపి ఊటలైన ఎన్నెలా

ఎన్నెలా ఎన్నెలా
ఆరుబయట
నా జల్లెడ మంచాన
ఎండి దుప్పటి పరిచి
మబ్బువంటి నా వంటికి
అద్దంబట్టిన ఎన్నెలా



ఎన్నెలా ఎన్నెలా
ఏటి పాటగా
నా గొంతులో మోగి
నా పలువరుసలో
జున్ను ముక్కలా మెరిసి
నా నవ్వు పువ్వులో
పరిమళించిన వెన్నెల

ఎన్నెలా ఎన్నెలా
గోదావరి కెరటాల్లో
పూలవానలా వచ్చి
అలసి సొలసి
పక్కజేరిన మా పల్లెకు
ఈడు తెచ్చిన వెన్నెలా
ఎన్నెలా ఎన్నెలా
మా వూరి చివర

ఇసక తిన్నెల్ని
మంచు దిబ్బలు చేసి
మండుటెండల్ల
నా సేద తీర్చిన ఎన్నెలా

ఎన్నెలా ఎన్నెలా
మా వాడ స్మశానంలో
మా అమ్మ సమాధి మీద
పొన్నాయి పూలలా కురిసి
నా ఎడదలో
స్మృతి దీపాన్ని
వెలిగించిన ఎన్నెలా

ఎన్నెలా ఎన్నెలా
పడమటి పొలాన
మా మామ మెడ తెగిపడ్డప్పుడు
వాడవాడలా వెలిదీపాలు వెలిగించి
జనసంద్రాన్ని
పొంగించిన ఎన్నెలా

ఎన్నెలా ఎన్నెలా
తెల్ల జాతులన్నీ
నన్ను అస్పృశ్యమన్నప్పుడు
నాతో వర్ణాంతరం చెంది
మానవ దర్శనమైన ఎన్నెలా!

నేను
నిజం చెబుతున్నాను ఎన్నెలా
నీవు కళవి
నేను శ్రమని
వర్ణాన్ని జయించిన వెన్నెలా
మనకి పుట్టిన బిడ్డే
సజీవ కవి!

# అందుకే నేను అగ్గిపూలు పూసేది



గాయమవుతున్న ప్రతిదీ
బింబమవుతోంది
బింబమవుతున్న ప్రతిదీ
నగ్న దృశ్యమే
నగ్నమైనదంతా
పదునుదేరుతోంది
పదును దేరిన ఖడ్గమే
సమరమవుతోంది

సమరం పురుడు పోసి
గుండెకు శ్రుతి చేస్తుంది
గుండెడప్పు గూడేన్ని
నిలువెల్లా కదిలిస్తుంది
కదిలిన గూడెం
కదనాన్ని కంటుంది
పూసిన కదనం
పోరాట శిల్పమౌతోంది
ఆయుధమా!
పరిణామాన్ని పరిమళించని
ఆ సౌగంధ్య పరిమళంలో
భూమి దక్కల చిందు చేస్తుంది

చూడటం మానేసినోడికి
పొద్దు పొడవటం
పొద్దు కుంకటమే తెలుసు
చూపులో సృజనముంటే
ముళ్ళ కంచెల్లో పొటమరిస్తున్న
మొలకల భవితవ్యం

తెలుస్తుంది
చూస్తున్నకొద్దీ కారుమేఘంలో
కార్చిచ్చు
కార్చిచ్చులో నిప్పుపూలు
నిర్బంధాన్ని కాల్చేదేదైనా
దాని ద్వారాలు పగలగొట్ట
దేన్నైనా రగల నీయ్
నా గుడిసె మీదకు
బుల్డోజర్ రాకముందే
దాన్ని అణుబాంబుగా పేలనీయ్

ఓ కవీ!
సృష్టికర్తవు నీవే కాదు
తూటాకు స్రవించిన
రక్త బిందువుల్లో నూత్నసృష్టి వుంది
గుండె పిడికిలి మధనం
ఒక సృజనం

సృజనానికి రమ్యమే కాదు
గమ్యం కూడా కావాలి
రణమైనా రాజ్యమైనా
సంఘర్షిత సృజనమే
అందుకే నేను అగ్గిపూలు పూసేది.

*(మునుగోపులలో కారం విజయమ్మ అనే గిరిజన స్త్రీని పోలీసులు దారుణంగా చంపిన సంఘటన చూసి)*

# చినుకు కొటు

గతం
వర్తమానాన్ని
కంటున్నపుడల్లా
పురిటి నొప్పులు

అడవిని
తగలబెట్టిన నిప్పుల్లో
విత్తులు విరబూస్తున్నాయి

కళ్ళలో
నీటి బిందువుల
వెనుక ధ్వనించే
సముద్ర ఘోష
గుండె గిటారలో
సమర గీతాలు పాడింది



కురుక్షేత్రంలో
నరకబడిన తలలే
మనుమసిద్ధి
చల్లిన నాణేల్లో
తిక్కనకు
కలువపూలై కనిపించాయి

రాజ్యం
నెత్తుటి బిందువుల
రంగవల్లిలో
నూతన సంక్రాంతికి
గుండెకాయల గొబ్బెమ్మలు
పెట్టుకొంటుంది

జన్మభూమిని కరిగించి
నాణాలుగా అచ్చుబోసి
అణాపైసలతో సహా
తెల్ల భవనం వైపు
విసిరేస్తున్న
ఓ చంటిబాబు ఆట
ఈ ఏటి సంక్రాంతికి కనులపంట
చినుకు కాటుకు
మృతులైన దుబ్బుకంకుల
శవదహనానికి
కవి సమ్మేళనంలో
బహూకృతులు

కానివ్వండి
కాళ్ళ కింద భూమిని
కాకి తన్నుకెళ్ళే రోజు
ఒకటుందనేది నిజం కానివ్వండి

*(సంక్రాంతి కవిసమ్మేళనం చూసి)*

*17-1-98*



## బొమిక చెప్పిక కథ

కాలం కడుపుకు
కొత్త శిశువు

కోడిపుంజు గొంతు
గడియారాన్ని ప్రసవించింది

ఎండిన చెఱువు
పుర్రెల్ని కంటుంది
నేల నెర్రెలో యిరుక్కున్న కర్రుకు
బొమిక చెప్పిన కథ

విత్తు విత్తినోడి బలికి
యిది చారిత్రక గుర్తు
పున్నమి చంద్రుడు కక్కిన వెలుగులోనేగా
ఆ అంగవస్త్రం కలనేత

గ్లోబు దగ్గరవుతున్న కొద్దీ
మురికిని ముద్దాడుతారు

కోయగూడెం కేకకెందుకూ
నక్క కూతని కలిపి
శబ్ద కాలుష్యం చేస్తారు?
ఏటిపాయ తేట నీటిలో
చచ్చిన కోయల్ల తేలుతూ
బలి తీసుకున్న దేవతలంతా
బోనులెక్కుతుంటే
బలైనవాడు చారిత్రక సాక్ష్యం
చరిత్రను చదివే కొద్దీ
గ్రహాలు గ్రహాలుగా పరుచుకోవడం లేదా !
ఎండి మిరగాయల కల్లంలా
నువ్ కురిపిస్తున్న దయ
నాకు కోరు పుట్టిస్తుంది
ఎంత ఉరిమి చూసినా
కాటి పుల్లలు
కాగడాలవ్వక మానవు
ఉప్పు ఎండిన గోసె
తోక చుక్కవుద్దని
అలలు ఆకాశం పలకమీద
రాయడం చూళ్ళేదా !

# ఊదుతూనే వుండు

గుండెతో
వెలిగించిన కొవ్వొత్తికి
ఆరిపోవడం రాదు

నీ దిగుడు బావిలో
వీళ్ళు నీళ్ళు తోడుతూనే
నిన్ను గండశిలగా చూస్తున్నారు
శరీరాన్ని మెదిపిన కొద్దీ
అది సీసంలా కరుగుతోంది

చిగురు మొనపై
కురిసిన మంచు బిందువులో
సూరీడు ఒదిగిపోతున్నాడు

ఆకాశం
భూమి మీద నిద్రించాలని
ఆరాట పడటమేగాని దానికి



జానెడు నేల దొరకడం లేదు
చీలిన నేల నెర్రెలో
పడిన కాళ్ళు
మందారాలు పూస్తున్నాయి
అయినా !
మనిషిని ప్రవాహం
చేయగలిగింది
అంతరంగానికి అద్దం పట్టగలిగింది
నిన్ను కదిలిస్తూనే వుంది

ఎందుకు ?
వాళ్ళు ఆ తోలు నిండా
వందపూతలు పూస్తారు
నీ కళ్ళలోని నక్షత్ర మండలం
స్వతంత్రంగా జ్వలించడంలా
మంత్రాలన్నీ నమసిపోయి
మనసు బాసకి
ఊపిరి రావడంలా
మట్టి వాసనకు
మబ్బులు తుంపులు తుంపులై
రాలడంలా

రాజిమ్మా !
నీవు వూదుతూనే వుండు
మంటేదో మసేదో
కాలమే తేల్చుద్ది.

*(వానలో పచ్చికట్టెల్తో పొయ్యి ఊదుతున్న దళిత స్త్రీని చూసి 18-1-98)*



# నేను అడివినే ఆహ్వానిస్తున్నాను

మీరు నా నెత్తినబెట్టిన
కట్టెల మోపుని నేనెంతకాలం మోసేది ?
దాన్ని దించుదామనుకొన్నపుడల్లా
ఎందుకు నా చేతులు ముద్దాడతారు
నేను ఎంత చిలికినా వెన్న రావడం లేదు
మీరు వెన్న తీసిన పాలని
నా పాత్రలో నింపారా?
అడవిలో వెన్నెల వృధా అవుతుందని
నేను పాటలు పాడే దాన్ని కదా!
నా తోటలోని పూలన్నీ
తగరపు పూలని వెన్నెల నాతో చెప్పి పోతోందేంటి?

ప్రతి మరణం
ప్రకృతిని వెలేస్తూ పోతుంటే
వీస్తున్న గాలంతా
కొండ చరియల్లో నిద్రిస్తుంటే

మీ టి వి గదుల్లో
రంగస్థలం తప్ప
అంతరంగం లేకపోతే
మీరు నా చుట్టూ పెనవేస్తున్న
చేతులు మృదువు మృదువుగా
కఠినమవుతుంటే
నేను నన్ను వెతుక్కునే సమయం
లేనంత క్రమశిక్షణలో
ఏక శిలగా నిలిచిపోయానెందుకు
మా పక్క గుడిసెలో
ఆ అరుపులు ఏంటి
వాళ్ళు మత్తులేకుండానే ఆపరేషన్ చేస్తున్నారు
మీరు నాకిచ్చిన మత్తులో
నాగరికతలో
నా గుండెను ఇంత సున్నితంగా
ఎలా నా నుండి తొలగించగలుగుతున్నారు
సరే
మీరేమన్నా అనుకోండి
నా ప్రకృతిలోకి నేను వెళుతున్నాను
నక్షత్ర మండలం పొద్దున్నే
ముఖం తిప్పుకోని ప్రదేశంలో నేను నివశిస్తాను
అది అడవైతే
నేను అడవినే ఆహ్వానిస్తున్నాను
మీరు చెట్లు నాటేలోపు
నేను ఎన్ని ఋతువులు పూస్తానో
విశ్వంలో ఎంతపరచుకొంటానో
మీ నాగరికతనే అడగండి

*13-12-1998*

# ప్రవాహం




మాతృత్వంలో
పాల బిందువు నన్ను వెలిగించింది
మంచు బిందువులో
అగ్నిశిఖలు నన్నుంటుకున్నాయి
పసికందు ఏడుపులో
తిరుగుబాటు నా తత్వం
కాగుతున్న
మనస్సు కొలిమిలో నాకు పదును
శరీరాన్ని మసిపాతలా
విసిరేసిన కొద్ది
అది నక్షత్రమండలంలా
నన్ను చుట్టుకొంటుంది
జ్ఞానం మంటకోసం
తపిస్తుంది
నేను ప్రవాహంతో పోటీ పడుతున్నాను
అది సముద్రంలో కలిసిపోతే
నేను సముద్రాన్ని రగిలిస్తున్నాను
నేను నడిచిన కొద్దీ
దూరాన్ని జయిస్తున్నాను
గమ్యం సమూహానిది
నేను అందుకోసం విస్తరిస్తాను

18-7-97



# భూమిని మింగిన తల

జలధుని సుడుల్లో విద్యుత్తు
ఋతువులు సుషుప్తిలో నుండి
జనిస్తున్నాయి
కరగడం ప్రారంభించాక
శిల్పాలు శిల్పాలుగా జీవితం
ఋతమవుతుంది
కట్టెకు నిద్రలేదని
కాలుతున్నపుడు తెల్సింది
కంఠం రాసిన కొద్దీ
రాగంలో కృతి
చూపుకు లక్ష్యం వచ్చాక

ఆకాశం గెలాక్సీ అయ్యింది

ఆత్మను బ్రతికించడానికి

శిరస్సును బలిస్తున్నారు

నేను బ్రతుకుతున్నానని

తెల్సుకునేలోపు

సమరం సాగరం అయ్యింది

నేను విస్తరిస్తున్న కొద్దీ

భూమి పింజరమయింది

చీకటిని చిదిమితే

రంగుల వలయమని

అంబేడ్కర్ చిరునవ్వు

అరుణ్‌శౌరికి ఉరి అని

ఆకాశం విసిరిన పిడుగు

అక్షరంలో ధ్వనించింది

శవాల కువ్వల్ని చూసి

గడ్డిపువ్వు నవ్వుతుంది

పింజరమైనా పిడుగైనా

విచ్చుకున్నదే విల్లంబు

నువ్వు తెంచాలనుకున్న తల

భూమిని మింగింది

*6-7-97*

# అస్తమయాన్ని కౌలదన్నాను



శిల్పం జీవాన్ని
కోరుతున్న కొద్దీ
జీవితం
శిల్పావృతమవుతోంది
చలనా చలనాలు
పరస్పరావృత్తాలు
ఆ కనుకొలకుల్లో
పునశ్చరణమవుతున్న
లోకాలోకాలు
సజీవ చేతనాన్ని ప్రవిస్తున్నాయి

జీవితం
నిమ్నోన్నతాల్లో
నలుగుతున్నదంతా
పరిమళమే
వాల్చిన రెప్పల్లో
వున్నంత లోతు
రెప్పలాడించే
మనిషికేమి తెలుసు
నేను విగ్రహాన్నవుదామని
మట్టి పిసికిన కొద్దీ
ఏదో నీటి బిందువు
నన్ను చలింప చేస్తుంది

నేను
ఆవిరవుదామని
చేసే ప్రయత్నంలో
ఏదో శక్తి నన్ను
ఆవహనం చేస్తుంది

నేను నిద్రపోతున్నానని
భ్రమించిన లోకం
నా చెవుల్లో సీసం
పోయాలని ప్రయత్నించింది
అది నా భయం పొరని కరిగించి
నాకు నిజం చెప్పింది
నేను ఏకాకి నవుదా'మన్నపుడల్లా
నల్లమబ్బు తునకలల్లా
చుట్టుముట్టి నన్ను
గుంపు స్నానం చేయిస్తున్నాయి
నేను ఒకటినని అరుస్తున్న కొద్దీ
ఈ సున్నాల ప్రపంచం
నన్నసంఖ్యాకం చేస్తుంది
నేను అద్దాన్ని అసమగ్రంగా
చూస్తున్నాను
బింబాలకందని
అంతర్మధనం
నన్ను నిజం కమ్మని శాసిస్తుంది
నేను తల్లైనపుడు బిడ్డని
బిడ్డనైనపుడు తల్లిని కాలేక పోతున్నాను
అందుకే
జీవితమంటే
ఒక దశ కాదని
ఒక సమగ్ర రసావిష్కృత గమనమని,
వెలగందేది
వెలిగించలేదని,
నేను అస్తమయాన్ని కాలదన్నిన
ఉదయ రేఖనయ్యాను
ఇక మీరు నా వంక చూడండి



## రాళ్ళకర్రంత నీడ

వాడ వాడల్లో
కన్నీరురాని కళ్ళలా చెరువులు
తల మీద పెట్టిన రెండు కుండలూ
తొణక్కుండా నడుస్తున్న
పాదాల్లో అచ్చరాలు
ఎండ నాలుకమీద ఎడారిలా పరచుకొనే కొద్ది
చెవులు మాట్లాడుతున్నాయి
భగ్గుమన్న మునికాళ్ళకి
ఒక్కబొట్టు నీటి బిందువు అందక
కాళ్ళను కాళ్ళే రాసుకొంటూ
పరుగు పరుగున
తాడిచెట్టు రాళ్ళ కర్రలా

గొట్టిన నీడపట్టెలో
తడార్పుకొంటున్న అరికాళ్ళు
బస్తీలో రోడ్డు మీద నిలబడి
గొణుగుతున్న నల్లకు
మాటరావడం లేదు
ఆపరేషన్ గదిలో
నెత్తుటి సీసాలకు కొదువలేదు
బజారు నిండా పులిసిన నీళ్ళు
నెర్రెలుగా పగిలిన భూమి
ఆకాశానికి ప్రాంసరీ నోట్లు రాస్తుంది
తన కళ్ళముందే మాడిపోతున్న బిడ్డకు
ఒక నీటి బిందువునప్పు ఇవ్వమని
అంపశయ్య మీద భీష్ముడు
నెత్తురు కాల్వలై పారుతున్న
కురుక్షేత్రంలో నీటి బిందువుకై తపించలా !
జీవిత యుద్ధంలో అలసిన
తాత సూరికింద కుక్కి మంచంలో
గళాసులో మిగిలిన ఒక్క బిందువుని
మనవడి గొంతులో పోస్తున్నాడు
గుడిసె మీద మట్టిపెళ్లల్లా
దుమ్మురేగుతున్న తాటాకు సహితం
ఆకాశంలోని నక్షత్రాలను
ఆ మబ్బుతునకల్ని యాడదాచారో చెప్పమంటుంది
మా ఇళ్ళల్లో ఈతాకు చాపలు

ఎంత ఇదిలిచ్చినా చుట్టుకుపోతున్నాయి
నీళ్ళపోత కోసం దొరువులోకెళ్ళిన కుండ
మొక్కల ముఖం చూడలేక బోర్లా పొడుకొంది
కోరీలో రాళ్ళతట్టకు
కురిసిన ఆ రెండు చుక్కల చెమటను
నాలుక నాక్కుంటుంది
నర్సరీలో గులాబిలన్నీ
పాపం బేరగాళ్ళ కోసం చూసేవి
ఇప్పుడు ఆత్మహత్యలు చేసుకోమన్న
అధిపతి వేపు చూస్తున్నాయి
ముంజికాయలు సహితం లొట్టపోయి
కత్తిగాట్లు మిగుల్చు కొంటున్నాయి
మా అమ్మ చెప్పనే చెప్పింది
ముందు గొంతు తడుపుకోండ్రా
తరువాత కాళ్ళ సంగతి చూద్దామని
ఇక బానలు బావురుమన్నా చేసేదేముంది
అవి నింపేవాడి గుండెలో
తేమ లేకపోయాక

20-3-98

# నిప్పుగా.....



నదులు ఇంకుతున్న చప్పుళ్ళు
కుండలు కుండలు నీళ్ళు చిమ్ముతున్న కొద్దీ
మడతలు మడతలుగా
ఒల్లు పొరలు పొరలుగా నెర్రెలవుతోంది
కళ్ళలోకి రేగుముళ్ళలా గుచ్చుకొంటున్న
అగ్గితుంపులు
బిడ్డ పొత్తిళ్ళలోని గుడ్డ చింపురులన్నీ
కసికలు కసికలుగా రుసబెడుతున్నాయి
గుడిసె గుడిసెంతా మద్దేల
బొగ్గుగనిలా కాగుతోంది
సూరుకూడా ఆ బెత్తెడు నీడను మింగేసింది
పడమటేపు నుంచి వస్తున్న గాలి
చెమట్లు కక్కుతోంది
నోటికాడ రొట్టె ముక్క గాజు పెంకులా
పంచభూతాల్లో సూరీని తానం
ఇప్పుడర్థమయ్యింది
నిప్పుగా బతకటమంటే
నిప్పుతో బతకటమే

*25-5-1998*

# జై కిసాన్

దారమొక ఉరిలా పేనుకొంటుంది
సముద్రపు మరగ జాలరని మింగినట్లు
రోజూ అలలపై తేలుతున్న వలలు

భూమినుండి పుట్టింది ప్రతిదీ
పదార్థం కాదు
విషబిందువు కూడా



బ్యాంకులన్నీ
పేగులు తాకట్టు పెట్టుకొంటున్న కొద్దీ
కళేబరాలు
ఉరి గవినిలో ఏలాడుతున్నాయి
మరణం తెల్లగా వుంటుందని
మెట్ట చేలో సమాధైన
రాగులు మృతవీరులై
ఘోషిస్తున్నాయి

రాజ్యం కొడుతున్న
పురుగు మందులకు
బలవుతున్న జీవుల గురించి
ఎవరూ దిగులు పడవద్దు

చచ్చేది చావుకాని
చంపేది చావు కాదు

ఆ చెట్టుకింద జొన్న చంకటితో
బిడ్డను పెంచుకొన్న తల్లి
గాజు కళ్ళతో చూస్తుంది
నా బిడ్డ నిద్రలేవడేమిటాని

ఆమె వళ్ళో కూర్చున్న
మనమరాలుకు చెబుతోంది
నాన్న మళ్ళీ వస్తాడు, ఏడవద్దని,
రాజ్యం ప్రశ్నిస్తుంది
ఎవరు రోదిస్తున్నారు?

నను కన్న నేలను
చీల్చి చూడండి
ఆరిపోని దివ్వేలా
వెలుగుతున్న
వారి ఆత్మలు వృధాపోవు

హరిత విప్లవం
వర్ధిల్లాలి
రైతువీరులారా
మరణాన్ని ప్రేమించండి
కిసాన్ రాజ్యం
కిసాన్‌ల రక్తంతోనే
జై కిసాన్ జై కిసాన్

*(పత్తి రైతుల ఆత్మహత్యల స్మృతిలో)*

*18-2-98*



# శిశువు ఎదురైనపుడు

చీకటి దొంతరల్లో

నేను తారాడినపుడు

నాకు భుజాన్నందించిందెవరు?

మీరేనా

ఎంత నమ్రతగా నా కళ్ళు దానమడిగారు

అవి మీకు ఇస్తూ

నేనెంత గర్వంగా మీ వంక చూశాను
నా కళ్ళ సహాయంతోనేనా
మీరు నా గుండె అద్దంలో చూశారు
అందనంత లోతుల్లో
అప్పుడు తెలిసిందా?
నేను ప్రవహించే నదినని
అయినా మీరు నా వెంబడి పరుగెడుతున్నారు
నన్ను కొండలడ్డుకున్నపుడు
రెండుగా చీల్తానుగదా.
అపుడు మీరు ఏ పాయ వెంబడి పరిగెడతారు.
మీరు నా ప్రవాహానికి దిక్సూచి
చూపిస్తారెందుకు?
నదీనాం సాగర సంగమమ్
అని పాటలు పాడి నన్ను
సంప్రదాయం చేయాలని చూస్తారా?
ఎందుకు నన్ను తోడిపోస్తారు.
ఒక్క బిందువైనా నా బిడ్డకు మిగల్చరా?
భిక్షకా!
నేను తల్లినయ్యాక కన్యనయ్యాను
కన్యనయ్యాక అమ్మతనంలోకి
ప్రవహిస్తున్నాను
ద్వంద్వ ప్రకృతుల సమరంలో
ప్రాకృతికమవుతున్నాను
నేను మైదానాలమ్మడి పరుగుతీయడమేమిటి?

నా ప్రవాహాంతరాల్లో
మైదానాలు లేవా?
నీవు కాళ్ళతో దిగితే
నాలో గండశిలలే తగులుతాయి
నా ప్రవాహంలోని
అంతరంగం లోతుని
కొలవాలనా?
ఈతగాళ్ళంతా నా లోతు చూడకుండానే
ఒడ్డుకు చేరి విజయం ప్రకటిస్తున్నారు
నేను నీలోకి నడవటానికి
భిన్న ప్రకృతులు ధరిస్తున్నాను
ప్రియతమా!
నీ పరుగులోని అంతఃస్పందనలు
నేను గమనిస్తున్నాను
అయినా నా మాతృకను
అందుకోవాలంటే
నీవు శిశువు కావాలసిందే
ప్రపంచమంతా కొండలు మిట్టలుగా నాకు
అడ్డు తగిలితే నేను
పాయలు పాయలుగా చీలిపోతాను
కాని ఓడిపోను
నాకు శిశువు ఎదురైనపుడు మాత్రం
ఏకధారగా అతని అంగిట్లోకి స్రవిస్తాను



# అగ్గి నౌక

సముద్రం గుండెల్లో
వేలెడంత తూటా

ఎవడు వీడు?
ఆకాశాన్నీ భూమినీ

గజ్జెలు చేసిన కాటి వీరుడు
నేత్రం సూర్యునిలో
దుమ్ముగొట్టాలన్న చంద్రిగాణ్ణి
మదంతో మట్టేశాడు

ఎవడు వీడు?
అడవి సింహనాదాన్ని
భాగమతి గుండెల్లో
నినదించిన బెబ్బులికి
విభూతి కుక్కల కొరుకుళ్ళా?
ఒరేయ్!
గద్దరంటే
ఈ యుగం నల్ల సంద్రంలో నడుస్తున్న
అగ్గి నౌక!
గుంపుపాటలో పుట్టిన
యుగగీతిక!
అది సంస్కృతి ! అది సంఘర్షణ !
గుండె పొరల్నిండా
మంటలు ! మంటలు !!

మూడోరోజుగాదు
మూడు గంటలకే లేచి
'నేను రెండోసారి వచ్చాను'
కాచుకోండి
ఇక ముద్దాయిలందరూ
బారులు తీరండి
శిలువనెక్కిన వాడిదే
అంతిమ తీర్పు!



# కిరీటం

జుట్టు పాయలో
కొరివి నిప్పులు

పాదం జల్లెడలో
నెత్తుటి ముగ్గు

అక్షరం గీయకనే
విరిగిన కాలి బలపం

ముఖం అస్తిపంజరాన్ని
కప్పిన చిరుగుపాత

అందాల పోటీలో
ఓమిస్ అందుకున్న
రాజస్థాన్ గుండెల
చితిలో పుట్టిన
కిరీటం

(అందాల పోటీ స్మృతిలో)
25-12-96



# చూపు

పొద్దువాలినపుడు
కళ్ళలో కారం జల్లిన
సందెగాడు
గుండెమీద చిందిన
నీటి బిందువులా
ఆవిరయ్యాడు

గుండె గుడిసెలో
కదలాడుతున్నోణ్ణి
కాసేపు మరుద్దామని
ఎంత ముచ్చట్లాడినా
కళ్ళ రెప్పల్లో
బొమ్మలు గీస్తానే వున్నాడు

కళ్ళ చుట్టు నల్లగా
పొలిమేరగట్టు పోసినట్టు
జుట్టంతా గోగుకంపలా

మారం వెస్తున్నా
పళ్ళెంలో కలిపిన
ఎర్రగారపు పచ్చడి
గొంతులో ఇరుక్కున్నా
ఏమి పట్టనట్టు
ఒకటే చూపు
పొరుగూరు పనికెళ్ళిన మామ
నలుగు పంచె
దండెం మీద ఎక్కిరిస్తున్న కొద్దీ
గుడిసె గుడిసంతా
ఒక్కసారి తగలబడినట్టు
నడిరేతిరిలో
పీడకల

ఏందే నీ చూపు
ఆడెళ్లిన కాడ నుంచి
మనిషి మనిషిలో లేవు అని
అన్న జేజికి
రాలే ఆకుకేం తెలుసే
పూసే చిగురు గురించి
రెప్ప తోడు లేని కళ్లు
రెమ్మలు లేని కొమ్మ
గట్టు ఒరిపిడి లేని నది
నిర్జీవాలే జేజా!
ఇల్లు, ఇరుగు తోడు కాదే
మనిషికి మనిషి తోడే
అని ఒక చూపు చూసింది



## నేనూ నీతో వుంటా...

నాయనా !
సముద్రమంత నూనె
ఒక్క దీపాన్ని వెలిగించడం లేదు
నీవు పెంచే చెట్లన్నీ
కట్టెల మోపులేనా?
కొండల నుండి దూకే జలపాతాలపై
తేలిన ఆ దుబ్బుకు చలనమేది?

నాయనా !
దృశ్యం కోసం ఎందుకు ఆరాటం
దృశ్యం నిత్య పరివర్తనం
శబ్దంలో వున్న లయతో నీ కర్ణభేరి
మత్తుక్రీడకు గురవుతుందేమి?
నాలుక అభ్యర్థనతో
రుచి తప్పిందేమి నాయనా !
పంచేంద్రియాలు
మత్తులో తూగాడితే
మార్గం మసక మసక కాదా?

నాయనా!
జీవ పరిణామమంటే
జ్ఞాన ప్రవాహమా?
సంహార విహారమా?
నీ పరుగు ముందుకేనా?
ఆ రోడ్డులో తారుకు బదులు
నెత్తురు పోస్తున్నారు
కాళ్ళు జారడం లేదా?
అన్నీ రాళ్ళ కుప్పలే కదా?
ఒక గుట్టకు బదులు, మరొక గుట్ట ఎందుకు?
విశ్వామంటే? విధ్వంసమా?
విశ్వవ్యాప్తమైన దానికి
నిర్దిష్ట క్షేత్రమెందుకు?
'సర్వేజనా సుఖినో భవంతు' అంటే
శిరచ్ఛేద ప్రహసనమా?

నాయనా !
అనంత శిల్పాలకు మానవుడు సృష్టికర్త
కర్త కర్మకు బలికారాదు కదా!
సృష్టికర్తకు చేతులే కాదు
మెదడూ, హృదయం కూడా లేవు
నీవు చేతులు నరికితే
పరిణామం ఆగుతుందా?
విశ్వానికి మూలతత్వం చేతులు కలపడం కాదా?

విశ్వాసమా! కాస్తఆగు
ముందు మానవధర్మాన్ని విశ్వసించు
అది శిధిలం కాకుండా,
నీవు దేన్నైనా నిర్మించు
నేనూ నీతో వుంటాను

*(రామ మందిర నిర్మాణం విశ్వాసంతో కూడుకొందని విశ్వహిందూ పరిషత్ అధ్యక్షుడు అశోక్ సింఘాల్ ప్రకటన విన్నాక)*

**కత్తి పద్మారావు**

**నీలికేక**

# లోకాయత ప్రచురణల ఇతర గ్రంథాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కులం పునాదులు - | కత్తి పద్మారావు | (1981) | 20-00 |
| 2 | జనగీతం | " | (1979) | 10-00 |
| 3 | హేతువాద సత్యాలు | " | (1980) | 5-00 |
| 4 | సాంఘిక విప్లవ రచయితలు | " | (1983) | 30-00 |
| 5 | కులసంఘర్షణలు | " | (1983) | 5-00 |
| 6 | women and Caste In India | " | (1983) | 5-00 |
| 7 | జైలుగంటలు | " | (1986) | 10-00 |
| 8 | దేశండైరి | " | (1987) | 20-00 |
| 9 | సాంఘిక విప్లవ మూర్తి డా॥ బిఆర్ అంబేడ్కర్ | " | (1990) | 20-00 |
| 10 | రిజర్వేషన్లు - హిందూమతోన్మాదం | " | (1991) | 8-00 |
| 11 | Social and Philosophical Movement In India | " | (1991) | 5-00 |
| 12 | Dalit Women | " | (1991) | 5-00 |
| 13 | దళితుల చరిత్ర (మొదటి భాగం) | " | (1991) | 10-00 |
| 14 | చార్వాక దర్శనం | " | (1991) | 25-00 |
| 15 | విముక్తిగీతం | " | (1987) | 5-00 |
| 16 | రక్తక్షేత్రం | " | (1992) | 5-00 |
| 17 | భారతీయ సంస్కృతిలో స్త్రీ | " | (1993) | 60-00 |
| 18 | కులం-ప్రత్యామ్నాయ సంస్కృతి | " | (1993) | 20-00 |
| 19 | దళిత సాహిత్యవాదం - జాషువా | " | (1995) | 15-00 |
| 20 | Dr B R Ambedkar the Visionary | " | (1995) | 5-00 |
| 21 | Caste and alternative Culture | " | (1995) | 100-00 |
| 22 | ప్రత్యామ్నాయ సంస్కృతిలో పెరియార్ మేళా | " | (1995) | 8-00 |
| 23 | జాషువా సామాజికతత్వం | " | (1995) | 3-00 |
| 24 | నల్లకలువ | " | (1996) | 20-00 |
| 25 | బౌద్ధ దర్శనం | " | (1997) | 35-00 |
| 26 | Charvaka Darshnam | " | (1998) | 100-00 |
| 27 | దళితుల చరిత్ర (రెండవ బాగం) | " | (1997) | 10-00 |
| 28 | అంబేడ్కర్ సిద్ధాంత భూమిక - కోట ప్రసన్న | " | (1996) | 12-00 |
| 29 | రచ్చబండ - మద్దూరి నగేష్‌బాబు | | (1996) | 25-00 |
| 30 | దళిత కిరణాలు - కలేకూరి ప్రసాద్ | | (1996) | 7-00 |
| 31 | వల్లకాడు (అనువాద కవిత డా॥ వి కృష్ణ) | | (1996) | 10-00 |
| 32 | దళిత పాట (పాటల సంకలనం) | | (1996) | 10-00 |
| 33 | లోయ (మద్దూరి నగేష్‌బాబు) | | (1997) | 25-00 |
| 34 | దళిత జనం పాటలు (రాంచందర్ బీంవంశీ) | | (1997) | 15-00 |
| 35 | దళిత దశాబ్దం (దేవరాపల్లి మస్తాన్‌రావు) | | (1997) | 35-00 |